

పేరు :- ఫణిహారం వెంకట రామానుజాచార్యులు.

కేంద్రం :- సంస్థానం హైస్కూలు, బొబ్బిలి.

వృత్తి :- గ్రేడ్ 1, సెలక్షన్‌గ్రేడ్ హిందీపండితులు.

అర్హతలు :- రా. భా. ప్రవీణ, హిందీ ప్రచారక్, యస్ యస్. యల్. సి.

అభిరుచి :- హిందీప్రచారం, పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి.

చిరునామా :- పి. వి. రామానుజాచార్యులు గ్రేడ్ 1 హిందీపండిట్,
శ్రీ ఆంజనేయస్వామి టెంపుల్, బొబ్బిలి-532 558
విజయనగరం జిల్లా (ఆం. ప్ర)



పేరు :- బాసరాజు సుగుణ,

కేంద్రం : తణుకు

యోగ్యత : గ్రేడ్ 1 హిందీ పండిట్, మెట్రిక్,

అభిరుచి :- హిందీ ప్రచారం, పరిచయపరీక్షయందు ప్రత్యేకకృషి-

చిరునామా :- బి. సుగుణ, హిం. పండిట్. సరస్వతీ హిందీ విద్యాలయం
తణుకు, ప గో-జి-



పేరు :- కె. సూర్యప్రకాశరావు

యోగ్యత :- యం. ఏ. (హిందీ) బి. యల్. రా.భా. ప్రవీణ, హిందీ
పండిట్ ట్రైనింగ్, అనువాదక ప్రశిక్షణ, టైపు హైయ్యర్
(ఇంగ్లీషు) లోయర్ (హిందీ).

కార్యక్షేత్రం :- ప్రిన్స్‌పాల్, హిందీవిశారద విద్యాలయం, నెల్లూరు.

అభిరుచి :- జాతీయభాషా ప్రచారం, కవితా వ్యాసంగం, పరిచయ పరీక్షకై
ప్రత్యేకకృషి.

చిరునామా : కె. సూర్యప్రకాశరావు. 5/101, పప్పులవీధి, స్టోన్‌హౌస్‌పేట.
నెల్లూరు-524 002 (ఆం. ప్ర)




సాహిత్య మాస పత్రిక

# 363

జూలై 1984

సంపుటి : 81, సంచిక 4

వార్షిక చందా : పదిహేను రూపాయిలు

విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు:

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

# ఈ సంచికలో

సంపాదకీయం

## —: 177 :—

మన కేంద్రప్రభుత్వంలోనూ, ప్రాంతీయ ప్రభుత్వాలలోనూ, హిందీ, తదితర ప్రాంతీయ భాషలూ అధికారభాషలుగా అంగీకరింపబడ్డాయి. మన దేశంలోని ప్రజలందరూ భారతీయ భాషలలోనే మన శాసన వ్యవస్థ జరుగుతుందని ఆశించారు. ఇంగ్లీషు స్థానంలో భారతీయ భాషలకు తగిన ప్రాధాన్యం లభించిననాడే మన స్వాతంత్ర్యానికి విలువ, మరియు ప్రయోజనం కూడాను.

స్వాతంత్ర్యం లభించి మూడు దశాబ్దాలు గడిచినా ఈ నిర్ణయం ఇంకా సంతృప్తికరంగా అమలులోకి రాలేదు. భారతీయ భాషల వికాసానికి కొన్ని ఆడ్డంకులు గూడా లేకపోలేదు. వాటిని అధిగమించి మన దేశ భాషలకు తగిన గౌరవాన్ని, స్థానాన్ని, కల్పించటం మనవిధి. మొదటి అడ్డంకి తగినన్ని పారిభాషిక శబ్దాలు లేకపోవటం. భారత ప్రభుత్వం హిందీలో ఈ పారిభాషికశబ్ద నిర్మాణానికి చాలా కృషి చేసింది. వేల సంఖ్యలో ప్రభుత్వ కార్యక్రమాలకు అనువైన పారిభాషిక శబ్దనిర్మాణం జరిగింది. ప్రాంతాలలో ఆ యా ప్రాంతీయభాషలు అధికారభాషలుగా అంగీకరింపబడ్డవే కాని, వాటి వికాసానికి జరిగిన కృషి స్వల్పము. వట్టి ఆర్భాటాలు, నినాదాలు మాత్రమే తరచు మనం చూస్తున్నాము, వింటున్నాము.

ఆంగ్లేయుల పరిపాలన కాలంలో ఇటు రాష్ట్రాలలోనూ, అటు కేంద్రంలోనూ, ఇంగ్లీషుకే ప్రాధాన్యముండేది. అందువలన మన అధికారులకు ప్రభుత్వ కార్యకర్తలకు ఇంగ్లీషులో వ్రాయటం అలవాటుగా ఏర్పడి ఉన్నది. వారు ఇంగ్లీషులో ఆలోచించి, ఇంగ్లీషులోనే వ్రాయడానికి అలవాటుపడి ఉన్నారు ఆ ఇంగ్లీషు మాటలకు తగిన హిందీ శబ్దాలుగానీ, ప్రాంతీయ భాషాశబ్దాలు గానీ, వారికి పరిచితంగా లేవు. ఇది ఇంకొక అడ్డంకి. వేలకొలది శబ్దాలు డిక్షనరీలలో ఉన్నా ఫైలు మీద వ్రాస్తున్నప్పుడు డిక్షనరీలు చూసి తగిన శబ్దాలను, ఏరుకొని, వ్రాయడం కష్టసాధ్యం. అందువలన కేంద్ర ప్రభుత్వం వారు ఏ విభాగానికి సంబంధించిన శబ్దాలను ఆ విభాగాలవారు ఉపయోగించేటట్లుగా చిన్న చిన్న పుస్తకాలను అచ్చువేసి ఆయా-విభాగాలకు సరఫరా చేశారు. అంతేగాక కొన్ని "చార్ట్స్" తయారుచేసి ప్రతి కార్యకర్తకూ అందచేశారు. ఆయినా పని ముందుకు సాగలేదు. ఆ కారణం వలన తిరిగి పునరాలోచన చేయవలసివచ్చింది. దానికి ఫలితంగానే కేంద్రప్రభుత్వం వారు నియమించినహిందీసలహాసమితులలో ఆలోచనజరిగి తంతితపాలా విభాగ

వారికి ఒక ప్రత్యేక సూచన చేయబడింది. దానికి ఫలితంగానే "177" ఫోన్ నెంబరు ఏర్పడింది, '177' ఫోనుచేసి ఇంగ్లీషుకు, తగిన హిందీ శబ్దాన్ని హిందీకి తగిన ఇంగ్లీషు శబ్దాన్ని గాని తెలుసుకొనే అవకాశం ఏర్పాటు చేయబడింది. ఏ డిక్షనరీలను చూడకుండా తమకు కావలసిన శబ్దాలకొరకై '177'కు ఫోనుచేస్తే ఆశబ్దాలు మనకు తెలిపే ఏర్పాటు జరిగింది. ఢిల్లీలోనూ జైపూర్‌లోనూ, బొంబాయిలోనూ, ఈ సౌకర్యం కల్పించబడింది. కాని దక్షిణప్రాంతాలకు కూడా ఈ సర్వీసు అవసరమని దాదాపు 4సంవత్సరాల నుండి తంతితపాలాశాఖ ప్రభుత్వ సలహాసంఘసభ్యులుగా ఉన్న శ్రీవేమూరి ఆంజనేయ శర్మగారు కృషి చేసియున్నారు. ప్రధానంగా వారూ, తదితర సభ్యులూ చేసిన కృషి ఫలితంగా హైదరాబాదులోనూ, బెంగుళూరులోనూ, తిరువనంత పురంలోను ఈ సర్వీసును ప్రారంభించటానికి నిర్ణయం జరిగింది. ఈ నెల 27వ తేదీ సాయంత్రం 6గంటలకు హైదరాబాదు 'టెలిఫోన్' భవనంలో '177' కు ప్రారంభోత్సవం జరిగింది.

హైదరాబాదులో ప్రారంభమయిన ఈ సర్వీసుకు ఇంకొక పెద్ద ప్రాముఖ్యమున్నది. బొంబాయి మొదలైన కేంద్రాలలో హిందీ, ఇంగ్లీషు రెండు భాషలకు మాత్రమే '177' సంబంధించి ఉన్నది, హైదరాబాదులో తెలుగుకు కూడా అట్టి సౌకర్యం లభించింది. ఇది ఆంధ్రులకు చాలా సంతోషకరమైన విషయం. అనగా '177' లో కూడా త్రిభాషాసూత్రాన్ని అమలు చేస్తున్నట్లు భావించవలసివుంటుంది.

177లోతెలుగును కూడా చేర్చటం జరిగిందే కాని తెలుగు పారిభాషిక శబ్దనిర్మాణంలో ఆంధ్రప్రభుత్వం వారు చేస్తున్న, చేసిన కృషి చాలా స్వల్పం. తెలుగు అధికారభాష అని తరచు పత్రికలలో చదవటమేగాని దానిని అమలు చేయడానికి సంతృప్తికరమైన కృషి జరగడం లేదు. ఎవరైనా ఆంధ్ర దేశంలో తెలుగులో ఫైలుమీద వ్రాయటానికి ప్రారంభించి ఇంగ్లీషు మాటలకు తెలుగు శబ్దాలు చెప్పమని '177'కు ఫోన్ చేస్తే ఏ బ్రౌన్‌గారి డిక్షనరీనో ఇంకొక డిక్షనరీనో చూసి జవాబు చెప్పవలసిందే ఫంక్షనల్ తెలుగుకు అవసరమైన, ప్రభుత్వ కార్యాలయాలలోని వివిధ శాఖలకు సంబంధించిన శబ్దజాలం నిర్మాణం కావలసి ఉన్నది. కేంద్ర ప్రభుత్వం వారు హైదరాబాదులో '177'ను తెలుగుసేవ ప్రారంభించటానికి అంగీకరించారు కాని వారికి పూర్తి సహకారం అందించడానికి, ఆంధ్ర ప్రభుత్వం కృషి చేయవలసిఉన్నది.

అధికార భాషా సంఘం. ఆంధ్ర ప్రభుత్వం, మొదలైన వారందరూ ఇకనైనా నిర్మాణాత్మకంగా కృషిచేయగలరనీ ఈ '177' ద్వారా తగిన ఉపయోగం పొందగలరనీ విశ్వసిస్తున్నాము.

# నా....సౌందర్యరాశి

— శేషం సుప్రసన్నాచార్యులు

కఠిన శిలా రవళిని తన వులి గర్భంలో నవమాసాలూ,
మోయించి, రమణీయ సుందరీ మణిగా ఏ శిల్పి-
చిత్రించాడో నిన్ను
ఓ...సౌందర్యరాశీ ! నాతో ఒక్కసారి మాట్లాడు.

*        *        *        *

పతుపాకరుణి దీధితి నీ శరీరంపై ప్రసరించిందో, నా మనసు
అంతర్భాగపు పొరలను త్రెంచి కవ్వంలా గిలకరిస్తోంది
ఓ...సౌందర్య రాశీ! ఏదయినా చెప్పు.

*        *        *        *

విహాయన వీధుల్లో విచ్చలవిడిగా విహారిస్తున్న—
విహంగముల జంటలా కనిపిస్తున్న నీ అచంచల-
నిషిద్ధనేత్రాల తీక్షణ దృక్కులు నా కళ్ళలోని
రెటీనాను చుంబిస్తున్నట్టుంది.
నా....సౌందర్య రాశీ! ఒక్కసారి మాట్టాడు.
గులాబీ రేకుల్లాంటి నీ అధర ద్వయాన్ని విడిపించి-
చక్కని, చిక్కని, పలువరుసని నా ముందుంచి ఒక్కసారి—
కల కలా- కిల కిలా నవ్వు
ఏ నైష్ఠికశిల్పి నిన్ను నా వద్దకు పంపాడో
నీలో నైరాశ్యాన్ని నింపి, నైర్మల్యాన్ని రంగరించి
నీదేహానికి పట్టించాడు.
మళ్ళీ నాలో నిర్వేదం నాతో మాట్లాడడం లేదని
అందుకే...ఓ...సౌందర్యరాశీ ! నాతో ఒక్కసారి మాట్లాడు.
ఏ విషమశరుని అందం నీలో నింపాడో, విహర్షమైనటు వంటి
విహాసిత మున్నట్టని పిస్తోంది నీ సుందర వదనంలో

ఏ జిష్ణుధనువు నీ దేహాన్ని స్పృశించిందో, సప్త-
వర్ణాలు నీదేహంపై అగుపిస్తున్నాయి.
నా...సౌందర్యరాశీ! నాతో ఒక్కసారిమాట్లాడు.
ఏమరుమల్లెల పరిమళాలు నీ పైగుప్పించాడో
ఏ పారి జాత సుమదళాలు నీలో నింపాడో
ఏ మొగిలిపూల ఘుమఘుమలు నీలో రంగరించాడో
ఏ చేమంతుల రెక్కలను నీపై వెదజల్లాడో
ఓ...సౌందర్యరాశీ! నాతో ఒక్కసారి మాట్లాడు
జలధి తరంగాల పైన పాతుకుపోయిన ఇసుక-
తిన్నెల్లాంటి నీ కుచద్వయంలో చెప్పలేని కాఠిన్యము
న్నట్టనిపిస్తోంది ఆ శీర్ష భాగాలు నిషాదులా!
అనిపిస్తున్నాయి.
నా....సౌందర్యరాశీ! నాతో ఒక్కసారి మాట్లాడు.
ఎదుటివారిని ఊరించి, మత్తు గొలిపించి, మరులు కురిపించి,
మధురానుభూతిని కలిగించి, చిత్తుగా ఓడించే సౌందర్యం నీది.
ఓ...సౌందర్యరాశీ! నాతో ఒకక్కసారి మాట్లాడు
ఎంతమంది గుండెల్లో పేకల ఆశల గూళ్ళు నిర్మించావో,
ఎన్ని జీవితాలను నీ మృదుమధురహాస్తాలతో-
పవిత్రం చేశావో
ఎంతమందికి నీ కౌగిట్లో స్థానమిచ్చి కరిగించావో
కరిగిన మనసులను ఘనీభవింపచేసి ప్రేమించావో
నా సౌందర్యరాశీ! నాతో ఒక్కసారి మాట్లాడు.
నీలో ప్రప్రథమంగా అంగాంగ సౌందర్యాన్ని తిలకించాను.
ఆస్వాదించాను,
ఏదీ! ఒక్కసారి! ఓ సౌందర్యరాశి! ఒక్కసారి మాట్లాడు.

తెలుగు పండితుడు
శ్రీ బాలాజీ ఇంగ్లీష్ మీడియం,
హుస్నాబాద్
కరీంనగర్ జిల్లా.

# వ్యగ్ర జీవనం

—శంకరగంటి రమాకాంత్

ప్రకృతిలోని అందాలను పరవశించి
చూచి తలయూచి పులకింప నోచికొనని
బ్రతుకు భారమై శాంతి దూరమయినట్టి
మానవుని జన్మ మిక్కిలి హీనముగద.

గున్నమామిడి చిగురు టాకులను మెసవి
పంచమ స్వరమున ఈ ప్రపంచమంత
ఓలలాడగ గానమ్ము నాలపించు
కోకిల గళమ్ము చెవులార గ్రోలునట్టి
తీరిక లభింపని బ్రతుకు ఘోరముగద.

కాయకసరుల కొఱుకుచు హాయిమీర
చెట్లపై ఖుషీగ షికార్లు చేయుచున్న
ఉడుత బుడుతల దుడుకు దూకుడుల చూడ
క్షణ విరామము చిక్కని జన్మ మేల ?

నిలుకడయె లేని బెదురుచూపులు విసరుచు
చెంగుచెంగున దూకు కురంగకముల
మృదులచేష్టలపై సుంతదృష్టి నిలుపు
భాగ్యమే లేని నరజన్మ వ్యర్థము గద.

దూది పింజల వలె వినువీధి లోన
సంచరించు శరన్మేఘ శకలములను
హాయిగా చూడ సుంతైన వ్యవధిలేని
వ్యగ్ర జీవనమందున అర్థమేమి ?
పక్షిజాతుల బహువిధ వృక్షతతుల
తేట నీటితో ప్రవహించు ఏటిలోన
ఎండబడి మిలమిల లాడుచుండు చేప
పాపలను, సముత్తుంగ పర్వతముల, చిఱు
గుట్టల, సముద్రముల తోడ చుట్టుకొన్న
ఈ సమస్త ప్రకృతిలోని యిన్ని సొగసు
లెన్నో దర్శనీయములైన వున్నగాని

సుంత విశ్రాంతి లేక నిరంతరమ్ము
విత్తమార్జింప దారుల వెతకుచుండు
నట్టి నీచంపు మానిసి పుట్టువేల ?
ప్రకృతి మాతృదేవీ పదాగ్రమున నిలిచి
ఎల్లవేళల పూజగావింప జాలు
మానవుని జన్మ ధన్యము కాని, కొంప
నిండ దండిగ సంపదలుండుగాక
శాంతి శబ్దార్థ మెరుగని జనుని జన్మ
జన్మమే గాదు ప్రత్యక్ష సత్యమిద్ది.

...పరిశోధక విద్యార్థి (తెలుగుశాఖ),
శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయము,
అనంతపురము

# శాంతి యుద్ధం

— చెన్నోజు రామ్మోహన్

విస్తృత విశాలాకాశం గుండా
యాంత్రిక ఉపగ్రహాలు గుట్టుగా ప్రసారం చేసే
సైనిక రహస్యాల వార్తా తరంగాలు ఢీకొట్టి
రెక్కలు విప్పి రెప రెప ఎగురుతున్న— ఈ
శాంతి పావురాలు తలలు తిరిగి
కొండ కోనల మీద నుంచి దొర్లుతూ
ముళ్ల కంపల రాతి లోయలలో పడి-
జలాహారాలు లేక
విలవిల్లాడుతూ గిలగిల గింజుకుంటుంటే—
ఉద్రిక్త పరిస్థితుల డేగలు -మారణాయుధాల కాళ్లతో
ప్రపంచ మంతా సంచరిస్తూ—రోదసిలోనూ రొప్పుతూ
పర్వత పరిష్వంగంలో-
ఈ కూలిన పావురాయి గుండెపై పొడుస్తూంటే
చివ్వున చిమ్మిన చిక్కటి ఎర్రని రక్త నదులు
బడుగు ప్రదేశాల గుండెల వంపు మీద నుంచి పారుతూ
తటస్థ వ్యక్తిత్వాలను ముంచుతూ
ప్రణాళికా 'ప్రగతి-దేవతల' ప్రాణం తీస్తూ
వికటాట్టహాసం చేస్తోన్న ఉత్తరార్ధగోళం-
దశకంఠునిలా!
ఆదిరిపడి బెదురు కళ్లతో చూస్తోన్న దక్షిణార్ధగోళం-
సీతలా!

మహబూబాబాదు-506101,
వరంగల్ జిల్లా.

# రొటీన్

—మంతెన సూర్యనారాయణరాజు

కాలం
కళ్ళు మూసుకుని
పరిగెడుతూనే వుంటుంది.
లంచాలు మేసేసీటు
సంతకాలకు విలువ
కడుతూనే వుంటుంది.
కసాయివాడి చేతిలో కత్తిలా
కళ్ళులేని చట్టం
న్యాయాన్ని ముక్కలు ముక్కలు చేసి
కాకులకు, గ్రద్దలకు
బలిచేస్తూనే వుటుంది.
కులమత శక్తులు
ప్రత్యక్షంగా ఆదర్శాలు వల్లించినా
పరోక్షంగా ఎదురుదెబ్బలు
తీసుకుంటూనే వున్నాయి.

పవిత్రకు మారుపేరైన మన్దేశంలో
మచ్చుకు మానవత్వమూ మృగ్యమే!
భారమైన భూమాత కరుణించి
ఈ లోకంలో దరిద్రులకు
ఏ ఆటంకం లేకుండా చేస్తూ
ఆయువుకు పెద్దోళ్ళను చేసి
తిండిలేక పస్తులుంచుతోంది.
మందు మజా
పొందు మజా
మరిగిన పశుప్రాయులంతా
రేయింబవళ్ళనే తేడాలేకుండా
నిత్యం బారుల్లోనో
సానివాడల్లోనో
తారాడుతునే వున్నారు.

తెలుగు లెక్చరర్
ఎస్ కె.బి.ఆర్. కాలేజి
అమలాపురం-533 201

# జ్వాలల్లో జాబిల్లి

—జీవన్

విశాల విహాయసం వెలుగుతున్నది
వినీల రమణీయంగా—
అక్కడక్కడ తళుక్కుమనే
చుక్కలు మెరుస్తున్నాయి టెక్కుగా—
నిన్నటి దాకా నాజూకు లొలికిన
నెలవంకపాప
నేడు పదారు వసంతాల పరువాల పూప,
చల్లని వెన్నెల చిరునవ్వులతో
చూపుల కమ్మని చెలువపు జిలుగుతో
నయగారాల నయాగరాల
హొయలు జిమ్ముతూ
భువన భవనాంగణాన కలకల లాడుతున్నది
భువన మోహనంగా
చిదమకుండా పెట్టిన దీపంలా
అల్లంత దూరాన్నుంచి చూచి
ఆశగా చేరువయ్యాడు
అందాల మబ్బు యువకుడు
అవకాశాన్ని బట్టి ఆకారం మార్చేవాడు
అందాల పైపై మెరుపులేగాని
అంతరంగాన దిటవులేనివాడు
ఆశయాలు అంబరం వైపూ
ఆచరణ అధోలోకం వైపూ
పరుగు లెత్తగా-
గాలితల్లి గదిమితే గల్లంతయ్యేవాడు
తండ్రి సూర్యుడురిమి చూస్తే నీరై కారేవాడు
నిన్ను చూసి మెచ్చా నన్నాడు
నిజంగా ప్రేమించా నన్నాడు
నువ్వు మాత్రం నాకిష్ట మన్నాడు
నీనగవుల సిరి నాదే నన్నాడు
నీసిరి నగవులు మాఅమ్మా నాన్నల
ఇష్టమన్నాడు.
కాబోలు అను కున్నది కన్నె జాబిలి
కలలు కన్నది అతని వెచ్చని కౌగిలికి
భూదేవే అరుగుగా
ఆకాశమే పందిరిగా
పాల వెన్నెల పట్టు చీరగట్టి
పరిణయ మాడింది నెల బాల.
పట్టు మని పది రోజులయిందో లేదో
పచ్చపచ్చని కలలపంట
కల్లల కళ్ళంగా మారింది.
చలువ నవ్వులు వేడి నిట్టూరుపులయ్యాయి
చెలువ మంతా చవుడు వారింది
హొయలు కులికే కలికి చూపులు
సెగలు చిలికి గాజు వారాయి.
కనువిందైన కమనీయరూపం
కళల తరిగి చిక్కి సగమైంది
నచ్చావని మెచ్చిన వాడు
నంగి నంగి కబుర్లతో

సన్నాయి నొక్కులు సాగించాడు.
వేదన రగిలి- ఎదపగిలి
జాబిలి జాలిగా
బిక్కు బిక్కు మంటూ
బిక్క మొగంవేసి-
చుక్కల ఇరుగు పొరుగులు
నోళ్ళు నొక్కుకుంటున్న వేళ-
చిరు తరగల
చిలిపి వెన్నెల వెలుగుల్ని
నిశిరక్కసి
నిర్దాక్షిణ్యంగా
చీకటి ముసుగేసి- కుత్తుక
చిదిమేస్తున్న వేళ-
తెలియడానికీ-తెలపడానికీ
కిక్కురు మన కుండా
దిక్కులన్నీ
దిగాలు పడిన వేళ-
మనసు లేని
మబ్బు ప్రియుని మాటున
జాలువారే మెరుపుల
జాబిలి--పాపం!
మసిబారిపోయింది.

తెలుగు పండితులు
M Z P H స్కూల్,
వేళంగి——533260
కాకినాడ తాలూకా

---

## ప్ర

— ధర్మవరపు బుచ్చి పాపరాజు

కడలి కడివెడు కన్నీరై,
అధః పాతాళ లోయ కుహరం,
హృదయగంభీరమై
ఉద్వేగ ఝంఝామారుతం, సప్తమస్వరమై
భవిష్యద్దర్శనోత్సాహ మానసిక ప్రవృత్తి
ఆకాశమై
గాఢాంధకార నిశ్శబ్దనిశీథి, నిరాశయై
చండ ప్రచండ గ్రీష్మ తాప ప్రతాపం......
ప్రతీకారమై
భూనిమ్నోన్న తాలు, సుఖదుఃఖాలై
అచంచల గంభీరశిఖరాగ్రాలు, దృఢ,
నిర్భయాలై
జాలువారు నదీనదాలు, కన్నీటి చారికలై
కంటకావృత మరుభూములు, అవసానకాల
హెచ్చరికలై
నిలిచింది పృథివినేడు, నిరాశాజీవికి ప్రతీకయై.

ఎస్.సి. హైస్కూలు,
యెల్లందు-507 123.

# కాంతి ప్రసవాలు

— చెన్నోజు రామ్మోహన్

—అతిత్వరలో తీవిగా కిరీటాలు ధరించగలమన్న ధీమాతో
సంఘ విద్రోహక శక్తుల మత్తు చూపుల వాడి కోరలు
—ఇంతకు ముందే
తలపై బాంబులు ప్రేలి ఉనికి కోల్పోయిన పగలు
తునియలై ఏ కొండ గుహలో రాలి పడిందో
—అంతా కొంత కొంత ఆశగా—మరో కొంత నిరాశగా
అహంతో—నిరహంతో
మానవ మేధ తన్నుకు చచ్చిన చందాన
రాత్రింబవళ్ళ పోరాట గాథలు—
మన్వంతరాలుగా-మహా యుగాలుగా-
మహా కల్పాలుగా విశ్వ పరివ్యాప్తమౌతూ
దీపించే దీపశిఖలై దేదీప్యమానమౌతూ
అడుగులో అడుగు వేసుకుంటూ
కాలం కదుల్తూనే వుందంటు-
నిండు గర్భిణి గమనంలా!
సూర్యుడు సృష్టించి వదలిన కాంతిల్లతలు
ద్వేషించే హృదయాలలో రాగాలు పూయించ డానికి
వేన వేల వెలుగులు విరజిమ్ముతూ
జ్యోతిర్మండల దివ్య కేంద్ర బిందువు నుండి
ఇటుగా వస్తున్నాయి
-ఇటు ముదిరిన మూఢత్వం లాంటి మలి సంధ్యలో
నగరాలు జోగుతూనే ఉన్నాయి———
పుట్టబోయే శిశువుల్లా!
తుఫానుకు ముందు ప్రశాంతతలా!
క్యాబరే నాట్యంలో చిట్ట చివరిఘట్టాన్ని
పరివేష్ఠించిన ఛీ! ఛీ!! చీకటి తెరలలా!
......అయితే ..........క్షణం గడిస్తే .............
లోకమంతా తెక్కుకు. మించిన వేకువల మయం———

# అబ్సర్డ్ నాటకాలు 4

— శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

## ప్రముఖ నాటక రచయితలు

### సామ్యుయల్ బెకెట్

ఈయన ఆంగ్లో ఐర్లండువాడు. పారిస్ నగరాన్ని కర్మభూమిగా చేసుకొని రచనలు చేశాడు. ఎక్కువ భాగం పారిస్‌లోనే నివసించాడు. ప్రథమంగా ఫ్రెంచి భాషలోనే రచనలు చేసి తరువాత ఇంగ్లీషులోగూడా వ్రాశాడు. తన రచనల్ని ఫ్రెంచినుండి ఇంగ్లీషులోకి ఇంగ్లీషునుండి ఫ్రెంచిలోకి తానే అనువాదం చేసుకొన్నాడు. అతడు జేమ్స్‌జాయిస్ శిష్యుడు. అందువలన ఆయన రచనలమీద జేమ్స్ జాయిస్ ప్రభావం ఎక్కువగా కనబడుతోంది. 1942లో ఫాసిజాన్ని ఎదిరించి చాలా బాధలు పడ్డాడు. ప్రాణ రక్షణకై చాలా చోట్లకు వెళ్లవలసి వచ్చింది. జాయిస్ కుమార్తె లూసియా ప్రేమను నిరాకరించాడు. ఆమెకు కొంచెం మతిభ్రమణముండేది. తరువాత ప్రఖ్యాత చిత్రకారిణి గగన్‌హీమ్ విషయంలో గూడా అదే విధంగా జరిగింది. కన్వెన్షన్స్ ఆఫ్ యాన్ ఆర్ట్ ఎడిక్ట్ అనే పుస్తకంలో గగన్‌హీమ్ చాలా విషయాలను పొందుపరిచింది. ఆయన మర్ఫీ అనే నవల వ్రాశాడు. ఆ నవలలో ఒక యువతి తన ప్రేమికుణ్ణి ఎంతో ప్రయత్నం చేసిగూడా ఏ వృత్తిలోనూ చేర్చలేకపోయింది దానికి పరిణామంగా ఆమె ప్రేమ వివాహంగా రూపొందని పరిస్థితి ఏర్పడింది. బెకెట్ జీవితానికి మర్ఫీ నవల ఒక ప్రతిబింబంగా తోస్తున్నది. 1950 నుండి బెకెట్ చాలా ప్రఖ్యాతి సంపాదించాడు. పది పదిహేను సంవత్సరాలు నాటక రచయితగా యూరపంతటా బెకెట్ పేరు చాలా ప్రఖ్యాతిని పొందింది. ఆయన దాదాపు పది నాటకాలు వ్రాశాడు. వైటింగ్ ఫర్ గోడో (1952, ఎండ్‌గేమ్ (1957)ఆల్ దట్‌ఫాల్(1961)వర్డ్స్ అండ్ మ్యూజిక్ (1962) ప్లే (1968) ఫిలిమ్ (1965)కమ్ అండ్ గో (1966) ఎమ్‌జో (1966) ఆ నాటకాలు. ఆయన నాటకాలు అబ్సర్డ్ నాటక పరంపరలో ప్రసిద్ధి కెక్కినవి. పరంపరాగతమైన కథా ప్రధానమైన విధానాన్ని వదలి నాటక రచనచేసి ప్రేక్షకులను రంజింప జేయవచ్చుననే సత్యాన్ని వైటింగ్ ఫర్ గోడో నాటకం ఋజువు చేసింది. అమెరికన్ నాటక కళాకారుడు విలియం సారోయాన్ ఆ నాటకాన్ని వేయి నోళ్ల ప్రశంసించాడు. బెకెట్‌కు నోబుల్ బహుమతి లభించింది.

వైటింగ్ ఫర్ గోడోలో ఏ కథా లేదు, చరిత్ర చిత్రణ లేదు. వెనుకటి వ్యాసాలలో ఈ నాటకాన్ని గురించి వివరించి వున్నాను. స్టేజి మీదకు ఎవ్వడూ రాడు. ఎవ్వడూ పోడు. ఎస్ట్రిగన్, వ్లాడిమీర్, పోజో, లక్కీలతో నాటకం నడుస్తుంది. ఈ నాలుగు పాత్రల స్వల్పకాలపు సహవాసం ద్వారా మానవ జీవితంమీద కాలచక్రం చూపిస్తున్న ప్రభావాన్ని చిత్రించడం జరిగింది. ప్రతి వ్యక్తీ దేనికొరకో నిరీక్షిస్తూ జీవితం గడుపుతుంటాడు. ఆ నిరీక్షణ ఈశ్వరుని కొరకుగావచ్చు, మృత్యువుకొరకు గావచ్చు, లేక ఇంకొక దానికి దేనికొరకైనా గావచ్చును ఆ నిరీక్షణ

జీవితానికి పర్యాయము. కాలచక్రం తాలూకు ఆవర్త నానికి ప్రతీక. మనుష్యుని శక్తిమీద సమయం తాలూకు ప్రభావం తప్పకుండా పడితీరతుంది అందు వలన జీవితంలోని మొదటిక్షణాన్ని రెండో క్షణంతో వేరుజేసి చూడడానికీ, మనుష్యుని వెనుకటి స్థితిని వర్తమాన స్థితితో పోల్చిచూడడానికీ అందువలన అవకాశ మేర్పడుతుంది. దీనిని చిత్రించడానికి ఈ నాటకంలో ఎన్నో ప్రతీకలు, కావ్యబింబాలు సృష్టించ బడ్డవి. ఎస్ట్రగన్ వ్లాడిమీర్‌లు రెండు పాత్రలు. ఒకడి కాళ్ళనుండి దుర్గంధం వస్తూంటే ఇంకొకడి నోటినుండి దుర్గంధం వస్తుంటుంది. ఒకరంటే ఇంకొకరు విసుగు జెందిపోయినా ఇద్దరూ కలిసి వుండక తప్పడంలేదు. ఇంకొక వికల్పమే వారికిలేదు. వికల్పమేదైనా వుంటే ఆత్మహత్య ఒక్కటే. దాన్ని గురించి వాళ్లు మాటి మాటికీ ఆలోచిస్తుంటారు. అయినా అది గూడా వూహా కల్పితంగానే వుండిపోతుంది. అసలు ఈ జీవితం ఒక అలవాటు. ఆ అలవాట్ల తాలూకు శృంఖల. దానిని మార్చడం కష్టం అందువలన మనకు యిష్టం లేకపోయినా అలవాటుగా మనం ఎన్నింటినో చేస్తాము. దానినే ఈ నాటకం అభివ్యక్తం చేసింది. వాళ్లిద్దరికీ ఒకచోట వుండడం ఇష్టంలేదు. ఉండక తప్పడంలేదు ఒకరిమీద ఇంకొకరు సౌహార్ద్రభావాన్ని వెలువరిస్తున్నా అవకాశందొరికితే ఒకరినొకరు వేధించు కుంటుంటారు పీడించు కుంటుంటారు. అట్లా చేస్తేనే గాని వారి కస్తిత్వమున్నట్లుగాదని వారి భావన. లేక భ్రమ. ఎటువంటి భావుకతలేకుండా శబ్దాడంబరం లేకుండా బెకెట్ ఈ నాటకంలో మానవ జీవితాన్ని కన్నులకు గట్టేటట్లు చిత్రించాడు. ఈ నాటకం మన దేశభాషల్లోకిగూడా అనువదించబడి ప్రదర్శింపబడ్డది. మొన్నమొన్ననే భోపాల్‌లో ఈ నాటకం బుందేలీ ఖండ్ భాషలోకి అనువదించబడి ప్రదర్శింపబడింది. శ్రీ కరంత్ నిర్దేశకుడు

బెకెట్ రెండోనాటకం ఎండ్‌గేమ్.

ఈ నాటకంలో జన్మమృత్యువుల మధ్యనున్న కాలాన్ని, క్షణాలను చిత్రించడానికి బెకెట్ ప్రయత్నం చేశాడు. వైటింగ్ ఫర్ గోదోలో ఒక నిర్జనస్థానాన్ని రంగంగా చిత్రిస్తే ఈ నాటకాన్ని ఒక గదిలో చిత్రించాడు. రెండురెండు పాత్రల్ని చేర్చి రెండురెండు జోడీలుగా నాలుగు పాత్రల్ని ప్రవేశపెట్టాడు. హెమ్ క్లోవ్‌లు ఒక జోడీ నెగ్,నెల్‌లు ఒక జోడీ అందరూ ఒకరకంగా వికలాంగులు. నెగ్‌నెల్ లిద్దరూ జీవిత సంధ్యాకాలంలో పరోపజీవులైనారు. వారు తన కుమారుడు హెమ్ మీద ఆధారపడి వుంటారు. హెమ్ క్లోవ్ మీద ఆధారపడి వుంటాడు. క్లోవ్ హెమ్ కుమారుడు గాడు. ఏదో కారణం వల్ల హెమ్ దగ్గర చేరాడు. నెగ్‌నెల్ లంటే హెమ్‌కు కొంత అసహ్యం. అయినా వారిని వదలలేదు. కాని క్లోవ్ హెమ్‌ను వదలడానికి సిద్ధుడే. అయినా వదలడు. నెగ్, నెల్, హెమ్ ముగ్గురూ మృత్యువు కొరకై ఎదురు చూస్తుంటారు.

హెమ్ హామ్లెట్ వంటివాడు. తన మెదడులోనే వాడొక కథను వ్రాస్తుంటాడు. నైతిక విలువలు పడి పోయినవని వాడి బాధ మానవ జీవితంలో కష్టాలు తప్ప ఏమీ లేవు. ఈ సమస్యను పరిష్కరించడానికి చాలామంది దార్శనికులు ప్రయత్నించారు. కాని వారి కెవ్వరికీ విజయం లభించలేదు అవే ప్రశ్నలు. అవే జవాబులు మానవుని కష్టాలు గట్టెక్కే మార్గం కన్పిం చడం లేదు ఈ సమస్యను పరిష్కరించే దెలా? ఈ నాటకంలో మానవ జీవితానికి సంబంధించిన లౌకిక సమస్యల్ని గాక అస్తిత్వానికి సంబంధించిన మూల భూత సమస్యల్ని కావ్యబింబాల సహాయంతో విశ్లేషిం చడానికి ప్రయత్నించాడు.

ఆల్ దట్ ఫాల్, యాంబర్స్ రెండూ రేడియో నాటకాలు. ఆల్ దట్ ఫాల్‌లో రూనీ అనే ఆమె తన

అంధుడైన భర్తను రైలునుండి దింపి తీసుకొని రావడానికి స్టేషనుకు బయలుదేరుతుంది. ఆ యాత్ర అవసాన యాత్రకు పర్యాయరూపంగా తయారవుతుంది. దోవలో జరిగిన ఘటనలన్నీ మృత్యుస్వరూప నిరూపణ చేస్తున్నట్లుంటవి. యాంబర్స్‌లో హెన్రీ సముద్రపు టొడ్డున కూర్చొని తన పుట్టుక, తండ్రితో తనకు కలిగిన అభిప్రాయ భేదాలు, భార్యా పిల్లలతో గడిపిన సుఖకరమైన దినాలు మొదలైన వాటిని గురించి ఆలోచిస్తుంటాడు. అవి అతని స్మృతి పథంలో కదలాడుతుంటవి. ధ్వనిరూపంలో ఆ ఆలోచనలు చిత్రీకరింపబడ్డవి.

క్రేప్స్ లాస్ట్ టేప్ చిత్రమైన నాటకం. స్టేజి మీద టేపు మిషన్ వుంటుంది. క్రేప్స్ యొక్క ముప్పది సంవత్సరాల జీవితాన్ని ఆ టేపు అభివ్యక్తంచేస్తుంది. టేపు వివరాలను వినిపిస్తుంటుంది. హేపీ డేస్ నాటకం ఇంకొక రకమైనది. ఏభై సంవత్సరాల వయస్సున్న ఒక మహిళ నడుం వరకు గుంటలో కప్పబడి వుంటుంది. రెండో అంకంలో గొంతు వరకు కప్పబడుతుంది. అంటే మృత్యువును సమీపిస్తుంటుంది. మృత్యువును క్షణక్షణం ఎదుర్కొంటూ గూడా జీవితాన్ని ఎంతో వినోదప్రాయంగా గడిపే ప్రయత్నం చేస్తుంది. మృత్యువును గూడా ఎంతో తేలికగా ఎంతో సహజంగా ఎదుర్కొంటుంది. తన సహజ వినోద స్వభావాన్ని వదలదు బెకెట్ మిగిలిన నాటకాలు కొన్ని ఏకాంకికలు కొన్ని రేడియో నాటకాలు. మహా యుద్ధాలు సృష్టించిన మానవ జీవితపు సమస్యల్ని చిత్రించినవి. అబ్సర్డ్ నాటకకారులలో ఈయనకు గల స్థానం అద్వితీయమైనది. నోబుల్ బహుమతి గ్రహీత ఆయన.

## ఆయనెస్కో

అబ్సర్డ్ నాటక రచయితల్లో రెండవ పేరుబొందిన వ్యక్తి ఆయనెస్కో. ఈయన రుమేనియా వాడు. తలి ఫ్రెంచి వనిత. ఫ్రాన్సులో ఎక్కువ కాలముండడం వలన ఆయనకు ఫ్రెంచి భాష బాగా తెలుసును. తన రచనలన్నీ ఫ్రెంచిభాషలో చేశాడు. భాషాగతంగా ఆయనెస్కో చాలా ప్రయోగాలు చేశాడు. భావ వ్యక్తీకరణకు భాష ఎంత అసంపూర్ణమో వ్యక్తం చేశాడు. 1944లో ఆయన ఇంగ్లీషు గూడా నేర్చుకొన్నాడు. ఆయన దాదాపు పన్నెండు నాటకాలూ, ఏకాంకికలూ వ్రాశాడు. చాలా శక్తి గలిగిన రచయిత ఆయన. ఆయన నాటకాలు బాల్డ్ ప్రయిమా డోనా (1949), ది లెసన్, ఆర్ ది సబ్మిషన్ (1950), ది చైర్స్ (1651) విక్టిమ్ ఆఫ్ ది డ్యూటీ (1953), అమేదీ (1953), ది పిక్చర్ (1955), ది న్యూ టెనెంట్ (1955), ది కిల్లర్ (1957), రాయినాసిరోస్, ఇంప్రొవైజెషన్ (1960), ఈ నాటకాలన్నీ అబ్సర్డ్ నాటక పరంపరకు గౌరవం తెచ్చినవే.

## జీన్ జెనే

జెనే బాల్య జీవితమంతా దొంగతనాలు, జైలు వంటి వాటిలో గడచింది. ఇరవయ్యో సంవత్సరం వచ్చేవరకు అతని తల్లిదండ్రు లెవరో గూడా అతనికి తెలియదు. పది సంవత్సరాల వయస్సు వరకు అతడు చాలా మంచి పిల్లవాడుగా పేరు బొందాడు తరువాత జీవితం మారిపోయింది. దొంగతనాలు చేసేవాడు. ఎన్నిసార్లో జైలుకు వెళ్ళాడు. జైలుశిక్ష పెరిగిన కొద్దీ అంత భయంకరంగా తయారైనాడు. జైల్లోనే నాటక రచన ప్రారంభించాడు. నవలలు వ్రాశాడు. కవితా ఖండికలు వ్రాశాడు. జీవితాన్ని నిశితంగా విశ్లేషించిన రచయితలలో అతనిది అగ్రస్థాన మనవచ్చును. ఆయన నాటకాలు ది మేడ్స్ (1949), ది బాల్కనీ (1956), ది బ్లాక్స్ (1960)లు ఇతడు చాలాప్రతిభావంతుడు. అబ్సర్డ్ నాటకాలకు చాలా గౌరవం తెచ్చిపెట్టినవాడు.

సాహిత్యం కూడా స్త్రీని ఒక శృంగార వస్తువుగానే భావించి, అంగాంగ వర్ణనలతో సంతృప్తి పడింది. ఆ పరిస్థితిని చూసి చలించిన చలం భావోద్వేగంతో స్త్రీ స్వాతంత్ర్యానికి ఒక కొత్త అర్థం చూపెట్టాడు. స్త్రీని ఓ మధుర మనోజ్ఞ మోహనమూర్తి గానే కాక హృదయం, మెదడువున్న సంపూర్ణ చైతన్యమూర్తిగా దర్శించాడు చలం.

స్త్రీని వివిధ కోణాల నుండి పరిశీలించిన సామాజిక శాస్త్రం 'స్త్రీ' ఎలాంటి ఇన్హిబిషన్స్ లేకుండా ఫ్రీగా, ఫ్రాంక్‌గా గాయబడిన పుస్తకం 'స్త్రీ'. మొదటి మాటలో ఇలా అంటాడు చలం: "స్త్రీకి శరీరం వుంది; దానికి వ్యాయామం యివ్వాలి. ఆమెకు మెదడు వుంది; దానికి జ్ఞానం ఇవ్వాలి ఆమెకు హృదయం వుంది; దానికి అనుభవం యివ్వాలి"

1925లో 'స్త్రీ' రాయబడినప్పుడు, ఈ పుస్తకం చదివి స్త్రీ చెడిపోతుందని, ఈ పుస్తకంలో చలం స్వేచ్ఛా ప్రణయాన్ని బోధిస్తున్నాడని సంప్రదాయ వాదులు గోల చేశారు "సెక్సు అంటే జీవితపు సూత్రం" అని గుర్తించిన చలం "ఆ ఆకర్షణని నిష్కపటంగా అంగీకరించి సౌఖ్యాన్ని సాధించిన వాళ్ళు ధన్యులు' అన్నాడు. మూర్ఖం వల్లా, అజ్ఞానం వల్లా స్త్రీ విలువ అర్థం చేసుకోలేని ప్రజ, తానుచూపే కొత్త కాంతికి కళ్ళు తెరవగలరని చలం విశ్వాసం. ప్రతి మగవానిలో "ఈమె నా స్త్రీ" అనే భావంపోయి కేవలం వస్తువుగా మిగిలి పోయింది స్త్రీ అలాగే స్త్రీకి పురుషుడు కూడా తిండి, నగలు, మర్యాద యిచ్చే సాధనం అయ్యాడు.

"మగడు వేల్పన పాత మాటది, ప్రాణ స్నేహితుండ నీకు" అంటాడు గురజాడ వారి 'ముత్యాల సరాలు' లోని భర్త భార్యతో. స్త్రీ ఇంటి నుండి బయటకు వచ్చి, జీవన యానంలో భర్త యొక్క గొప్పతనాన్ని గుర్తించి, గౌరవించాలే గాని, స్త్రీని వంటింటి కుందేలును చేసి, "ఓహో, భారతనారీ! నీవు పతివ్రతవు" అని కీర్తిస్తే లాభం లేదు. స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం పొందిన నాడే ఆమెకు బయట స్వేచ్ఛ లభిస్తుంది హక్కుల, అధికారాల ప్రసక్తి లేకుండా, స్వార్థరహితమైన స్నేహం ముఖ్యమని గుర్తించిన నాడు స్త్రీకి లోపలి స్వేచ్ఛ లభిస్తుంది.

ఆకలివలె, కామం కూడ ఒక జీవసంబంధమైన (బయోలాజికల్) అవసరం. పెళ్ళిపుద్దేశ్యాలలో కామం ఒక ముఖ్యమయిన విషయం అయినా గృహస్థ ధర్మానికి, పరలోక గతుల కోసం కొడుకుల్ని కనేందుకని ధర్మపన్నాలు వల్లిస్తారు సామాన్యంగా మనం మోహం అనుకునేది నిజంగా కామం. మోహమే ఆధారంగా వివాహం ఏర్పడాలంటాడు చలం. మగవాడికి తాను మోహించిన స్త్రీని వివాహం చేసుకునే అవకాశం వుంది. కాని తనకు ఎవరి మీద మోహం కలుగుతుందో వారిని భర్తగా చేపట్టే స్వేచ్ఛ స్త్రీకి లేదు.

మగవాడు తన అధికారాన్ని నిలుపు కోటానికి స్త్రీ పతివ్రత కావాలన్నాడు భర్త కుంటివాడయినా, కుష్టువాడయినా, దురలవాట్లున్నా అతనిని పూజించాలంటుంది సంఘం 'పతివ్రత' అనే అధ్యాయంలో చలం ఎంతో ధైర్యంగా హేతుబద్ధంగా ఖండిస్తాడు ఈ కాన్సెప్ట్‌ని. "స్త్రీని యిళ్ళలో దాస్తే పురుషుడు ఆమెకు వింత". అలాకాక స్త్రీకి స్వేచ్ఛనిచ్చి, పురుషుడి వలె తిరగనిస్తే తన స్వేచ్ఛనీ, గౌరవాన్ని నిలుపు కోవడం నేర్చుకుంటుంది; తన మానం తానే కాపాడు కొనగల శక్తి, తెలివి సంపాదించుకుంటుంది స్త్రీ అందరికి తాను చెయ్యవలసిన విధులున్నాయి. కాని తనకు తాను జరుపుకోవలసిన విధులు కావాలి. "పురుషుడు తిరగక చెడ్డాడు; ఆడది తిరిగి చెడింది" అంటుంది పురుష నీతి. తనకు తాను స్వతంత్రంగా జ్ఞానాన్ని సంపాదించే హక్కు స్త్రీకి వుండాలి. "స్త్రీ పురుషులు నిజమైన స్నేహితులు, దంపతులు

కావాలంటే ఇద్దరికీ సంపూర్ణమైన స్వేచ్ఛ వుండాలి. ప్రేమ బంధమే కాని అధికార బంధం వుండ కూడదు''.

"భర్త వద్దని యేడుస్తున్న చిన్నపిల్లకి బలవంతంగా కట్టి పెడుతుంది, భర్త కావాలని గోలపెడుతున్న వితంతువులకు నిరాకరిస్తుంది." అని సంఘాన్ని దుయ్యబడతాడు చలం. "స్త్రీకి హృదయం ప్రేమించటానికి వుంది" అని కవిత్వం చెవుతారే గాని స్త్రీకి మెదడు వుంది; ఆమెకూ అభిరుచులు, ఆవేశాలు అభినివేశాలు, ఆదర్శాలు వున్నాయని ఒప్పుకోరు. "రాజ్యమేలగల స్త్రీలు కూడా అంట్లే తోముతున్నారు అని బాధపడతాడు చలం. మూఢత్వం, అజ్ఞానం తగ్గగానే స్త్రీ తప్పకుండా తిరగబడుతుంది అని హెచ్చరిస్తాడు చలం. దేవుడేర్పరచిన వంట మనిషిగా, జీతం లేని సంఘ బానిసగా స్త్రీ వుండదు.

వేశ్యావృత్తిని శాస్త్రీయంగా పరిశీలించితే ఆర్థిక కారణాలు కన్పడతాయి. కాని చాలామంది వేశ్యను చీదరించు కుంటారు. "తమ ఆత్మల్నీ, నీతినీ అమ్ముకునే న్యాయవాదులకన్నా, అన్యాయం మోసం జంకు లేకుండా చేసే వర్తకులకన్నా హీనమయిందా భుక్తి కోసం శరీరాన్ని అమ్ముకునే వేశ్య?'' అని ప్రశ్నిస్తాడు చలం.

'బడిచదువులు'లో "ప్రస్తుతం బళ్ళల్లో కాలేజీంలో పెద్ద చదువులు చదువుకుంటే స్త్రీలు ఉత్త దౌర్భాగ్యులు; స్త్రీత్వం వాళ్ళలో చాలా వికృత రూపాన్ని పొందుతోంది" అంటాడు చలం. సమాజ పురోగతిలో వచ్చే మార్పులలో ఇదొకటి. 'న్యూ ఉమన్ కాన్సెప్ట్' ని సరిగా అర్థం చేసుకోలేకపోయాడు చలం. ప్లాటోనిక్ [ఐడియల్] లవ్ గురించే కలలు కనే స్త్రీలను చలం అసహ్యించు కుంటాడు.

''లైంగిక బానిసత్వాన్నుండి బయటపడిన స్త్రీలు సంపాదన అనే బానిసత్వానికి లొంగి పోతున్నారు'' అన్నాడు సెల్బైన్. "అత్త అధికారం నుండి, భర్త ఆధీనం నుంచి తప్పించుకున్న నవీన స్త్రీ షోకులకీ, సంఘ గౌరవానికీ, ఫాషన్‌కీ బానిస ఔతోంది'' అని వాపోతాడు చలం.

"ఆర్థికస్థితి వల్ల పెళ్ళిచేసుకోలేక పోతున్నారు కొందరు స్త్రీలు. భర్తదయ మీద ఆధారపడవలసిన పరిస్థితి వుంది స్త్రీకి. ''ఈ సమస్యలన్నిటికి కమ్యూనిజం గొప్ప జవాబు" అంటూనే ''మనుషులకి యీ లోకంలో మిగిలిన ఒక గొప్ప దూరపు కల అది" అంటాడు చలం.

'స్త్రీ స్వేచ్ఛ' లో సంఘంలో వున్న హిపోక్రసీని బహిర్గతం చేస్తాడు చలం. స్త్రీని అప్సరస, యీశ్వరాంశసంభూత, జగన్మాత, సుశీల. శాంత అంటూ పొగుడుతూనే స్త్రీని అవమానిస్తారు, బందీని చేస్తారు. డబ్బు సంచి పురుషుడి చేతిలో మాత్రమే వుంటే ఇదే పరిస్థితి కంటిన్యూ అవుతుంది. ''స్త్రీకి కావలసింది తనమీద, తన జీవితం మీద, తన శరీరం మీద, మనసుమీద, హృదయం మీద సంపూర్ణాధికారం.' 'తన సేచ్ఛని తలుచుకుని భయపడే హీనస్థితికి స్త్రీని 'తెచ్చి, ఇప్పుడు ఆమెకు పురుషుడి మీద ఆధారపడటం ఇష్టమని అంటారు.'' యీ పురుషుని నిరంకుశత్వాన్ని కూలదొయ్యాలంటే ఆర్థిక స్వాతంత్ర్యం ఒక్కటే సాధనమని చలం గుర్తించాడు. (మన స్ఫూర్తిగా గుర్తిచాడా? అనేది ప్రశ్న.)

'సంఘనీతి' లో ''సంపూర్ణమైన తృప్తిలేనిదే స్త్రీ పురుషులు కలిసివుండటం వ్యభిచారం కాదూ?'' అని ప్రశ్నిస్తాడు చలం. కాలం చెల్లిన భావాలు, నీతులు మారాలంటాడు.

మోనాగమీ (ఒక పురుషుడు - ఒకస్త్రీ యావజ్జీవమూ కలిసి వుండటం) ఆచరణలో విఫలమయింది. మనుషుల కామవాంఛల్ని అదుపులో వుంచి విద్య ద్వారా, శిక్షణ ద్వారా వారిని మోనాగమీ ఆదర్శం

వైపు మళ్ళించాలంటాడు చలం. ''మోనాగమీలో ప్రతి స్త్రీ పెళ్ళి చేసుకుంటే, సగటున ప్రతి పురుషుడికి స్త్రీ దొరుకుతుంది'' అంటాడు చలం.

కులమతాల పట్టింపు ఉన్నంత కాలం ప్రతి పురుషుడికి స్త్రీ దొరక్కపోవచ్చు. అందుకే సనాతనులు విధవా వివాహాలను నిషేధించారు ''కాని రేస్ గొప్పది కావాలంటే, ఒక గొప్ప అతనికి పదిమంది స్త్రీలు కనడమే ఎక్కువ ఉపయోగకరం. హీనులైన వాళ్ళకు స్త్రీ పురుషులు దొరకక పోవడము అట్లానే మంచిది'' అన్న చలం మాటల్లో ఫాసిస్టు అండర్ టోన్స్ విన్పించడం లేదూ?

''స్త్రీకి పెళ్ళి ఖైదు. స్త్రీ పురుషులకు మర్యాద నీతికట్టు'' అన్న చలం మాటల్లో షావియన్ షార్ప్ నెస్ కన్పడుతుంది పురుషుడు స్త్రీ తనకు అందనంత కాలం ఆరాధిస్తాడు తనకు లభ్యమవగానే శృంగార జీవనం గురించిన కలలు మామూలు జీవితంలో కరిగిపోయి సామాన్యంగా కన్పిస్తుంది స్త్రీ. ఇది లోక సహజం.

'జీవితంలో దాగుడు మూతలాడుకుంటున్న మోహాన్నే కోరుకుంటాను.'' అంటాడు చలం. 'మోహ జీవనమంత వెలుగు జీవితానికి లేదని అంటారు చలం బోటి రోమాన్సిస్టులు' అని చలం తన గురించే చెప్పుకున్నాడు.

''లోకంలో చాలా ఉన్నతస్థితిలోవున్న పురుషుడు తన ప్రియురాలి దాసుడుగా ప్రవర్తించాలి. శ్రీకృష్ణ సత్యభామల సంబంధం ఆదర్శం'' స్త్రీ పురుషుడికి దాసిగా ఉండకూడదంటూనే చలం పురుషుడు స్త్రీకి దాసుడుగా వుండాలనటం విడ్డూరం కదూ? స్త్రీపురుషులిరువురూ సమాన భాగస్వాములు కనుక స్నేహితులుగా వుండాలి. నవీన స్త్రీలను నవీన సత్యభామ లంటూ, వీరిని ఆ పూర్వకాలపు శ్రీకృష్ణుడు కూడ భరించలేడంటాడు చలం. నవీన స్త్రీల అహంభావం ఎక్కువై పోయింది అంటాడు.

సంఘంలో చాలా మంది మొండివాళ్ళు. మార్పు అంటే భయపడతారు. ''వున్నదేదో మంచిదని, రాబొయ్యేది యెప్పుడూ అరిష్టమని నిశ్చితాభిప్రాయం సంఘంలో స్త్రీకి జరిగే అన్యాయం గురించి చెప్పినా వినరు.'' నిజం చెప్పేవాళ్ళ నోరును నొక్కాలని ప్రయత్నిస్తారు. లైంగికజ్ఞానం గురించి చెబితే బూతంటారు. కాని వారే వాత్స్యాయన కామసూత్రాలు, కావ్యాల లోని శృంగారాన్ని రహస్యంగా చదువుకుంటూ ఆనందిస్తారు. ఈ హిపోక్రసీ అంటేనే చలంకి విపరీతమైన కోపం, అసహ్యం.

ఈ పుస్తకంలోని 'సంఘం-స్త్రీ' అనే ప్రకరణము చలం యొక్క అవగాహనా శక్తిని తెలియ జేస్తుంది. సంఘం నిలబడాలంటే వివాహం అవసరం. మానవ నిర్మితమయిన వివాహాన్ని ఈశ్వర నిర్మితమని, పుణ్యమని రాశారు. వివాహానికొక పవిత్రత నాపాదించి, దానిని మత, ధర్మబద్ధం చేసారు. కాలం మారింది. పాతధర్మాలు వ్యర్థమైపోతున్నాయి. ప్రేమ పెళ్ళిళ్ళు, కుదిర్చిన పెళ్ళిళ్ళు అన్నీ కూడ నిష్ఫలమౌతున్నాయి. వేలవేళ్ళుగా కట్టుబాట్లలో పెంచబడిన స్త్రీ సంఘాన్ని గౌరవిస్తుంది. కాని అభ్యుదయ భావాలు గల భర్తని అనుకరించటానికి వెనుకాడుతుంది. ఒక్కసారే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభ్యమయిన స్త్రీవివాహ విచ్ఛేదనానికి పూను కుంటున్నది. ఇది స్త్రీ పురుషులకు సంధి యుగం. అశాంతితో, అసంతుష్టితో ఆరాటపడుతున్నారు స్త్రీలు. స్త్రీకి స్వాతంత్ర్యమివ్వాలంటూనే పురుషుడు తన అధికారాన్నీ, పెత్తందారీ తనాన్ని వదులుకోలేక పోతున్నాడు. ఈ పరిస్థితి మారితేనే శుభోదయం ప్రారంభ మౌతుంది అంటాడు చలం.

''వ్యక్తి స్వాతంత్ర్యానికి, సంఘ క్షేమానికి వైరుధ్యం ఏమీ లేదు'' అంటాడు చలం బాధ్యతల

గురించి వ్రాస్తూ. నవీన స్త్రీ తనని తప్ప ఎవరిని ప్రేమించదు. స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వాలంటే పురుషుడు ఆర్థికంగా, రాజకీయంగా, ఉద్యోగరీత్యా బానిస కాడా అంటారు కొందరు. కాని స్త్రీబానిసత్వం హీనాతి హీనం. స్త్రీని గురించి అసహ్యంగా మాట్లాడటం ఫాషనయింది. ఈ మన స్తత్వం మారాలి. "రతిని మాటల వల్లేనే చాలా అనింపార్టెంటుగా, కాజువల్‌గా నన్నా చూడాలి లేక చాలా సీరియస్‌గా, డివైన్‌గా చూడాలి నీతి, వ్యక్తి గురించి రాస్తూ, "ఏ కార్యమైనా. చేసిం తర్వాత దాని ఫలితాలవల్ల గాక ఆ కార్యమే అసహ్యంగా, నీచంగా తోచి దిగులుపడితే ఆ కార్యం పాపం, అవినీతి" అంటాడు చలం.

కామోద్రేకం గురించి రాస్తూ, యువకులలో సహజమైన కంట్రోలింగ్ శక్తివుంది అంటూ "యీ కాలంలో ముద్దులులేని తెలుగు సినిమాలు. కౌగిలింతలు లేని నీతి కథలు, పురాణాలు వాళ్ళ వుద్రేకాన్ని రెచ్చగొడుతున్నాయి" అంటాడు చలం. సాంప్రదాయ వాదుల్ని షాక్ చెయ్యటానికి సెక్సును అనుభవించ చేతగాని వాళ్ళు నిగ్రహం గురించి బోధిస్తారు. "తమకు లేని సుఖం ఇతరులు అనుభవించి పోతారని ఈర్ష్య" దీనినే ఇంగ్లీషులో 'ఎడాగ్ ఇన్ ది మేంగర్ పాలసీ' అంటారు. "తప్పని సరి అయితేతప్ప నిగ్రహంలో ఏమీ ఔన్నత్యం లేదు." అని నొక్కి చెప్పాడు చలం

'ప్రేమ'లో "అందరూ ప్రేమగురించి మాట్లాడినా ఈ యుగంలో చాలా కొద్దిమందే ప్రేమను యెరుగుదురు" అన్న చలం మాటలు "ట్రూ లవ్ ఈజ్ లైక్ ది ఎపియరెన్స్ ఆఫ్ ది ఘోస్ట్. ఎవ్వెరివన్ స్పీక్స్ ఆఫ్ ఇట్ యెట్ ఫ్యూ పీపుల్ హేవ్ సీన్ ఇట్" అన్న లా రోచ్ ఫి కాల్డ్ మాటలు జ్ఞప్తికి తెస్తాయి.

ఆదర్శ ప్రేమ సామ్రాజ్యం (యుటోపియన్ లవ్) గురించి కలలు కనే స్వభావం చలంది. అందుకే "స్త్రీ గాని, పురుషుడు గాని ఈ శరీరాన్ని, మనసుని నిర్మలంగా, జాగ్రత్తగా వుంచాలి. రాబోయే ఆ దివ్య మూర్తికి ఆనందంతో సమర్పించటానికి" అంటాడు.

ఆ తర్వాత "భార్యనీ పిల్లల్నీ పోషించ గల సంపాదన కలిగే వరకు మొగవాడు పెళ్ళి చేసుకో కూడదు" అని హితవు చెప్తాడు. ప్రేమ అనుకునే దంతా కామమే. ప్రేమ నిలవాలంటే నూతనత్వం చెడ కూడదు. "పురుషుడికి స్త్రీ శరీరం తాకితే అపవిత్రం అవుతుందేమో అన్నంత సుందరంగా కనపడాలి. మోకరించి భక్తితో పూజింపగల రసజ్ఞతా సౌందర్యారాధనా వుండాలి" ఇలాంటి వాక్యాలతో భావ కవులలో కన్పడే సౌందర్యారాధన, ఐడియలిజమ్ కన్పిస్తుంది ఈ ఐడియలిజమ్ ఎంత వెర్రి తలలు వేసింది అంటే అ తర్వాత ఇలా అంటాడు చలం. "భార్యాభర్తలు ఒకరి నొకరు అన్ని అవస్థల లోనూ కనపడి అసహ్యం కాకూడదు. ఒకరి శరీరం ఒకరికి కొత్తగా ఆకర్షకంగా వుంచుకోవాలి. ఎవరి బాధ్యతా, ఖర్చు వారే వహించి వేరే యిళ్ళలో కాపుర ముండి, అవసరమైనప్పుడు కలుసుకోవడం వుత్తమం" ఇలాంటి వాక్యాలు మనకు వాత్సాయన కామ సూత్రాలలో గాని, ఇంకేదైన కామశాస్త్ర సంబంధమైన పుస్తకంలో కాని కన్పిస్తాయి.

'రామాన్స్, రసజ్ఞత' లో భావోద్వేగంతో కవిత ల్లాంటి వచనం దర్శనమిస్తుంది. "ఆరోగ్యవంతులైన స్త్రీ పురుషులు వెన్నెల రాత్రుల సముద్రతీరాల, నదీ తీరాల, చల్లగాలితో, తెల్లని యిసుక మీద, నీళ్ళ చప్పుడులో లేక అందమైన అడవులలో, పచ్చిక బయళ్ళ మీద, తమ సుందర దేహాన్ని దాచుకునే అవసరమూ అసహ్యమూలేక జతగా విహరిస్తూ, ఆడుతూ, పాడుతూ నవ్వుతో, స్వేచ్ఛగా నిర్మలాకాశం కింద, పువ్వుల వాసనలో, భూమే శయ్యగా, తిరిగి కలుసుకునే అదృష్ట మెప్పుడు కలుగుతుందోకదా!"

"స్త్రీ పురుషులు స్నేహితులై లోకంలో జీవించే టప్పుడు, అనుభవాలను, అభిప్రాయాలను పంచుకునే టప్పుడు" నిజమైన ప్రేమ కలుగుతుంది అంటూ దివినుండి భువికి దిగివస్తాడు చలం. "పురుషుడు తన తలిదండ్రుల పోషణకీ, సేవకీ భార్యని నియోగించ కూడదు" అనే విపరీతమైన స్టేట్‌మెంట్స్ యిస్తాడు.

"ప్రేమ అంటే అర్థం తన అహాన్ని చంపుకోవడం రెండో వారి ఆరాధన" అనే చలం మాటల్లో ఆధ్యా వాదుల దైవ చింతన కనపడుతుంది.

"నీతులన్నీ ధనం వెనుక దాగున్నాయి" అనే చలం మాటలు పచ్చి నిజం.

'ముగింపు' లో మనిషి "స్వంతంగా ఆలోచించు కోవాలి" అంటాడు. పురుషుడు చంపివేసిన తన ఆత్మ గౌరవాన్ని స్త్రీ మరల సంపాదించుకోవాలి. తన పుస్తకాలు చదివి ప్రజలు పాడవుతున్నారనే అపవాదుని గురించి చలం ఇలా అంటాడు; "నా పుస్తకం చదివి నంత మాత్రాన, నా మాటల్ని నమ్మి, వినాశనంలో పడేటంత బుద్ధిహీనులు ఎక్కడా లేరని నా నమ్మకం"

తెలుగు(నవలా)సాహిత్యంలో చలం ఒక వెల్లువ. ఉన్నవ లక్ష్మీనారాయణగారు తమ 'మాలపల్లి' లో సంగదాసు చేత ఇలా అని పలుస్తారు. "వరదలవల్ల కొంత నష్టం కలిగినా, నది ఎండిపోవడం కంటె వరదలే మేలు కదా! సంచలనం చైతన్యచిహ్నం, జడత్వం మరణ చిహ్నం"

'స్త్రీ' రాసినప్పుడు చలంలో తిరుగుబాటు తత్వం ఎక్కువగా వుండేది. "ఆ కాలంలో నేను బతకటం ఇష్టంలేని ప్రజలమీద దండెత్తి సెల్ఫ్ ఎసర్ట్ చేసుకోవడమే ప్రధానంగా వుండేది. ప్రజలకు ఎంతకోపం తెప్పిస్తే నాకు అంత సంతోషం. నన్నెదిరించే వాళ్ళను అదర కొట్టటానికి ఎంత తీవ్రమైన మాటలూ, శక్తి హీనంగా తోచేవి అందువల్లనే ఆనాటి నా పుస్తకాల నిండా అతిశయోక్తులు, వన్‌సైడెడ్ స్టేట్‌మెంట్స్ ద్వేషంతో కూడిన తిట్లూ, అనవసర శృంగారంవుండేవి (చలం).

చలం రాతలలో స్త్రీ స్వేచ్ఛ గురించి రాసినప్పుడు అతిశయోక్తులున్నాయి. కాని అవి ఎక్సాజరేషన్స్ ఆఫ్ ఎవైటల్ ట్రూత్. సమాజంలో మూఢ విశ్వాసాలు ప్రబలినప్పుడు, మనుషులు వివేకంతో, చెప్పే మాటలు ఆలకించని దశకు చేరుకున్నప్పుడు, చాలా మంది మేధావులు, బెర్నార్డ్ షాలా, షాక్‌ట్రీట్‌మెంట్ ఇవ్వవలసిన అవసరం ఏర్పడుతుంది. అలానే తెలుగుదేశంలో స్త్రీకి పనికిమాలిన నీతి నియమాలు కట్టుబాట్లు ఏర్పరచినప్పుడు, ఆమెలో దాగివున్న చైతన్యాన్ని, వెలుగును బయల్పరచటానికి చలం ఎంతో కృషి చేశాడు. అందుకు తెలుగు వాడు గర్వించదగిన రచయిత చలం.

వి. యస్.యమ్. కళాశాల
రామచంద్రాపురం-533255
తూ॥గో॥జిల్లా

# బ్రతుకుబాట

— యు. శివలింగం

నడిఒడ్డున పల్లె. పల్లెనిండా జనం. జనం బతుకు శూన్యం. పల్లెల్లో గుళ్ళు. గుళ్లల్లో దేవుళ్ళు, వాళ్ళు మృత ప్రతిమలు, అవి మనిషి మలిచిన మట్టి బొమ్మలు, పురోహితులు గర్వాంధులు. ఉచ్చైస్స్వర మంత్రోచ్చారణ, మృదుస్వరం, చెట్టుకింద చచ్చు వేదాంతచర్చ, బాధబరువు, దుఃఖభయం, బలవంతులు ధనికులు, బలవంతుల ఏలుబడికింద బలహీనులు. నీతి సూత్రాలు ఇతరులకోసం, ఇరుకు వీధులు, స్పర్ధ మనసులు, వాళ్ళ దేవుళ్ళు అనైక్య వాదులు, ప్రజల మనసుల్లాగా దేవుళ్ళ దర్మాలూ అంతే, ఆ పల్లె ఒక ప్రపంచం.

ప్రజలారా! వినండి. విడనాడండి అవినీతిపోరాటం, అపవిత్రం మీ జీవితం, జీవిత సత్యగీతం వినిపించే విశ్వగాయకుడు తర్వలో వస్తాడు. అని వినిపించాడొక ధవళ వస్త్రధారి సన్యాసి.

చీకటి రాత్రికోసం తన నిర్మల హృదయం విప్పిందొక మల్లెపూవు.

‘జీవిత సత్యగాయకుణ్ణి నేను ఎన్నో బాధలు పడ్డాను, అనుభవించాను అనేక కష్టాలు. ఎదలో పదిలపరచుకో శుద్ధగీతం. త్యజించు మూఢమత విశ్వాసాలు, తొలగించు గందరగోళాలు. సృష్టించే దేవుళ్ళను కర్మకాండల అంధవిశ్వాసాల ఉక్కు చక్రంలో జీవితాన్ని బంధించకు, చిరుదివ్వె వెలిగించుకో. పరులముఖం మీద కనపడదు నీడ, విముక్తిడివి కావాలి. జీవితాన్ని ప్రేమించు. ఒంటరితనం పోతుంది. నేను స్వేచ్ఛా జీవిని, నిత్య సుఖజీవిని. జీవిత సత్య సౌందర్య గాయకుణ్ణి.” అని ప్రబోధించాడు హృదయవీణ మీద విశ్వజీవనగీతం పలికిస్తున్న విశ్వగాయకుడు.

మండుతున్న నేలమీదకు మెత్తగా వస్తోంది వాన. విని ఊరట చెందారు కొందరు. అన్నీ ఆవలకు నెట్టి బంధాలు తెంచుకుని విముక్తులయ్యారు మరికొందరు.

నీ పాటతో మా దేవుళ్ళ ధర్మాలను ఎలా సమ్మేళనం చేసేది? నీ పలుకులు మేము సృష్టించిన దేవాలయాలకు ఏ విధంగా పనికొస్తాయి ?

‘చిక్కులు తెచ్చేవాడవి, నీవు చెప్పేది మాకు అనర్థదాయకం, నీ పనులు పైశాచికం వెళ్ళిపో’ అన్నారు.

విశ్వ జీవన గాయకుడు నిష్క్రమించాడు. అనైక్యతతో, మతవిద్వేషాలతో ప్రజలు కీచులాడుతూనే వున్నారు. రక్తపు మడుగుల్లో మతం స్నానం చేస్తూనేఉన్నది.

చల్లపల్లి
దివి తాలూకా
కృష్ణాజిల్లా 521 126

తనివితీర ఆస్వాదించాలని ప్రయాణిస్తున్న పిల్ల తుమ్మెదల బారు మాదిరి యున్నదట నీలాదేవి నూగారు.

అండజగామిని యూరువు
బిఁడువలపులాన నాభిబిలము వెడలిచ
న్గొండల నడుమను ప్రాకెడి
కుండలియోయనగనారు కొమరొప్పారున్.
[ఆముక్తమాల్యద 5-25]

కృష్ణరాయలు 'నాభి బిలమునుండి వెడలి నిశ్వాస పరిమళమళములాన స్తనపర్వతముల మధ్య ప్రాకెడి పాముపలె ఉన్న'దని గోదాదేవి నూగారును వర్ణించాడు. అలాంటి కమ్మని ఊహే తిమ్మన కూడా కావించాడనటానికి పైపద్యం సాక్ష్యం.

చమత్కారమైన వర్ణనలు గావించుటలో కూడ కూచి మంచి తిమ్మన మంచి చతురుడే అనటానికి ఒక ఉదాహరణము·

మగువ మొగమున కెనగాక మిగులఁ బొగిలి
తొగల చెలికాడు పదియాఱు తునియలయ్యె.
సిరుల కిరవగు నెత్తమ్మి విరిదలంకి
యొయ్య నొయ్యన వేమాఱు వ్రయ్యలయ్యె.
(2-21).

నీలాదేవి ముఖం చంద్రమండలం కన్నా మనోహరంగా, సహస్రపత్ర కమలం కన్నా సుందరంగా ఉందనడానికి యీ పద్యం వ్రాశాడు తిమ్మన· ఆమె ముఖవర్చస్సు తనకు లేదని దుఃఖముతో చంద్రుడు పదునారు తునకలైనాడట. చంద్రుడు పదునారు ఖండములన్న పౌరాణిక ప్రసిద్ధ విషయాన్ని ఈ విధంగా చమత్కారంతో సంధించాడు కవి· అలాగే వేయి రేకులుంటాయి సహస్ర పత్ర కమలానికి. ఆమె అఖండ ముఖ సౌందర్యాని కోడిపోయి సహస్ర పత్రకమలం వేయి ఖండాలయిందట. సహజంగానే వేయి రేకులుండే కమలం వ్రేయి వక్కలగుటకు కారణం ఆమె ముఖశోభతనకు లేదన్న శోకంతో అని చమత్కరించాడు కవి. ఇందు కారణం కాని దాన్ని, కారణంగా ఊహించుట వలన హేతూత్ప్రేక్ష.

చందమామ ఆకాశ సరోవరంలో విరబూసిన ఎఱ్ఱ కలువ వలె ఉన్నదట. అందలి మచ్చ దాని నాస్వాదించడానికి వ్రాలిన మగతుమ్మెదట. ఈ కంద పద్యమెంత అందంగా ఉందో చూడండి

మినుఁ గొలకునఁ బూచిన,చ
క్కని చెందొవ యనగ దనరె గలువల దొర లో
గననయ్యెఁ గప్పు మదిక
త్తిన వేడు కనుండు గండుఁ దేటి యనంగన్.
(3-9)

తిమ్మన సహజమైన వర్ణనలతో మూర్తి సాక్షాత్కారం గావించుటలో కూడ మొనగాడే.

ఈ గొల్లల వర్ణన చూడండి. పాలకురికి పంథాలో మనకు కన్నులకు గట్టేటట్లు వర్ణించాడు.

కిఱ్ఱు చెప్పులుగొప్ప గీఱునామంబులు
మొలచెక్కు కత్తులు నిలువు సిగలు
కుడిముక్కుగ్రమ్ములు గురివెంద పేరులు
పిల్ల గ్రోవులు మేటి వల్లె త్రాళ్ళు (3-49)

అదే విధంగా కుంభకుని యింటికి వచ్చిన బ్రాహ్మణుని వర్ణనకూడ తిమ్మన యొక్క నిసర్గ వర్ణనా నిపుణతకు మణిదర్పణంగా నిలబడేటట్లుంది. చదివి చూడండి.

తిగరేక లేర్పడ దిద్దిన నొసలి ను
న్వేలి బూది బొట్టు రంగులు సెలంగ
సరవిఁజిచ్చరకంటి దొరకంటి పేరింటి
పేరులు పేరెదఁ దెంపుమీర—— (1-60)

స్థలా భావము చేత పద్యార్థాలను మాత్రమే యిచ్చితిని.

ఆనాటి తెలుగువాళ్ళ పెళ్ళి ఎలా జరిగేదో సమగ్రంగా నీలాకృష్ణుల పెండ్లి వర్ణనలో మనకు తెలిపి

నాడు తిమ్మన. పేరంటాండ్రు పెండ్లి కొడుకునకు, కూతురునకు కాళ్ళగోళ్లు తీసి, తలలకు చమురురాచి, నలుగులు పెట్టి, అయిరేని కుండలనీరు పోసినారట. వధూవరుల చీర చెఱగులను ముడివేసి చిటికెన వ్రేళ్లను పరస్పరము పట్టించి అరుంధతీ సతీమతల్లికి మ్రొక్కించినారట ఇంకా తెరపట్టుట, కాలుద్రొక్కించుట తాళిబొట్టు గట్టుట, ముత్యాల తలఁబ్రాలు పోసుకొనుట సమగ్రంగా వర్ణించాడు. నీలాకృష్ణుల శృంగార లీలను కూడా విచ్చల విడిగా వర్ణించక కొద్ది పద్యాల్లోనే ముద్దుగా ముగించి ఔచిత్యాన్ని కాపాడినాడు తిమ్మన.

ఇది అచ్చతెలుగు కావ్యమని ఆదిలోనే ముచ్చటించినాను. పేర్లు తప్ప తక్కిన శబ్దాలన్నీ అచ్చికములే. కాని శ్రీకారంతో కావ్యారంభం చేయుట సంప్రదాయం కాన 'శ్రీలకుఁ దానకంబగుచు' (1-1) అని ఆరంభించాడు 'శ్రీ' అన్న దొక్కటే ఈ కావ్యంలోని ఏకైక తత్సమం. ఆయన అచ్చిక పదబంధ నిర్మాణ నైపుణ్యాన్ని చూపడానికి స్థాలీపులాకంగా కొన్ని ఉదాహరణ లిస్తాను.

'శార్దూలచర్మధారి' అనుటకు 'బెబ్బులిరేఁదిమ్మరితోల్ ప్రబ్బినతమిఁ గప్పుకొన్న బలువేల్పునకున్' (1-18) ఇది కంద పద్యంలోని ఉత్తరార్థం. 'దశరథుడు' అనుటకు 'బంతి తేరుల పంట వలంతి ఱేడు' (1-43) 'శశిరేఖ' అనుటకు 'బుడుత కల్వల విందు' (1-75). 'ద్విజచంద్రుడు' అనుటకు 'నేలవేల్పు జింకతాలుపు' (1-85). 'బ్రహ్మవంశశ్రేష్ఠుడు' అనడానికి 'తమ్మిచూలి వంగడ జాబిలి' (1-86). 'పద్మనాభుడు' అనడానికి 'తమ్మి పొక్కిటి మేటి' (1-105). 'రుద్రాక్షమాల' అనడానికి 'చిచ్చరకంటి దొరకంటి పేరింటి పేరు' (1-60), 'కేసరి' అనడానికి 'జడలమెకము 1- ) 'యదు వంశకలశాబ్ధి చంద్రుడు' అనడానికి 'గొల్లకొలంపుఁబాల్కడలి క్రొన్నెల' (2-3). 'షట్పదము' అనడానికి 'ఱమిలిముక్కాలు' (2-25). 'మత్తేభము' అనటానికి 'అముదేనుగు' 2-72). 'బలి' అనటానికి 'చాగంపు బల్రక్కసుడు' (2-41). 'కామజనకుడు' అనడానికి 'మరుసయ్య' (2-72) 'లక్ష్మి' అనడానికి లిబ్బుల చెలి (2-102) చిలుక అనడానికి తొగరు ముక్కు బల్పక్కి (3-38) కాలకృత్యములు అనడానికి తఱిచెయ్వులు (3-46) హంస అనడానికి తూకుమేపుడు (3-114). ద్వారపాలకులు అనడానికి గవనికాపరులు (2-47). ఇల్లాలు అనే శబ్దానికి బదులీయన ఇల్లుటాలు (1-71) అని వాడినాడు. కానీ, భూసురుడు అనడానికి పుడమిదయ్యము (1-62) అన్నాడు. అలాంటివి కొంచెం మోటుగా, ఎబ్బెట్టుగా ఉన్నాయి.

తిమ్మన నన్నయ వలె అక్కడక్కడ తేటగీతలను ప్రాసయతితో నడిపినట్లే ప్రాసయతి నియమాన్ని ప్రతిపాదంలోనూ పాటించాడు పై పెచ్చు ప్రతి పాదములోను ప్రాసయతిలో ఒకే వర్ణము నుంచుకొన్నాడు.

దండఁగొండపోల్కి నండునో నొండెడ
దండితనము మీఱనండ గొనక
పిండిపిండి గాగ రెండు కాళులఁదాచి
దండిపండి పొలసు దిండిఁజెండె (1-73)

ఒక ఆటవెలది పద్యంలో వృత్తాల్లో వలె ప్రాస నియమాల్ని పాటించాడు.

కొంకు లేనివెతలఁ గుందెడి ముగుదల
డంక తనము మీఱ జంకులేక
బింకమునఁగలంచె డింకనెన్నడు నీకు
వంక గల్గ దోటు జింక తాల్ప! (3-21)

పోతనగారి అనుప్రాసను అనుకరించి అందమైన పద్యాలు వ్రాశాడు. అందంగా పద్యాన్ని కొలిచినట్లు విరిచాడు.

పులుగులు గూసె జక్కవలు పొందుగ డాసె
బొజుంగు మూఁకకుం
బొలుపులువాసె రిక్కగమి పోడిమి మాసెఁ బిసాళి
తుమ్మెదల్
గొలకులఁబ్రామోసెఁ జీకటులు గొబ్బున మూసె
మరుందు తుంటవిల్
బలువడినెక్కుఁ దీసె దొగపైదలియుంగను మూసె
నెంతయున్ (8-44

ఇందు ప్రభాతాన్ని స్వభావోక్తిలో అను ప్రాసాలంకారాన్ని రంగరించి వర్ణిచాడు.

నీలాదేవి శృంగారాన్ని చంపకమాలలో సొంపుగా వర్ణించటంలో ఆమె తనూ విలాసానికి ఉత్కర్ష కలిగించే విధంగా అనుప్రాసను వాడాడు. తిమ్మన.

పలుకులఁదేనెలూరు మేయి
బంగరు నిగ్గులు దేఱఁ జూపులం
దళుకులుమీఱఁ జెక్కులను
దద్దయు ముద్దులు గాఱ మోమున
న్వెలపలరారు గ్రొమ్మొగులు
వన్నియఁగేరును కొప్పుతీరహో!
చిలుకల కొల్కి సౌరునెటిఁ
జెప్పగ నల్వకు నైన దీరునే? (2-19)

వృత్త్యనుప్రాసమును పారమ్యమునకు గొంపోయిన పద్యములు కూడ ఇందున్నవి. మచ్చునకు ఈ ఆశ్వాసాంత పద్యాన్ని తిలకించండి. శంకరుణ్ణి తలంచగానే ఆ కవిభక్తుడు పదాలపై అక్షయాధికారం పొంది పద్యాన్ని ఎంతసునాయాసంగా నడిపాడో చూడండి.

మత్తగిల్లు సత్తుగిత్త శత్తడినెక్కి
మిత్తి మొత్తి సత్తినత్తిబత్తిఁ
బత్తిరిడిన ముత్తి బుత్తులురెండును
నొత్తిగుత్తగట్టుచుండు తేఁడ. (1-118)

[మదించిన నందినెక్కేవాడా! మృత్యువును జయించినవాడా! పార్వతీదేవిని అంటిపెట్టుకొన్నవాడా! బిల్వపత్రాలతో పూజించే భక్తులకు భుక్తి ముక్తి ప్రసాదించేవాడా!]

నీలాకృష్ణులమధ్య ప్రేమరాయబారాలు బ్రాహ్మణునిచే నడిపిస్తాడుకవి. ఇది బమ్మెరపోతన రుక్మిణీ పరిణయములో బ్రాహ్మణుని తలపింపజేయకమానదు. రుక్మిణీదేవి 'ఆ బ్రాహ్మణుడు కృష్ణునితో ఏమని తెల్పునో ? ఆ మాటలు విని కృష్ణుదేమని తలచునో ? నేను గౌరీ దేవిని గూర్చి నోచిననోము లేఫలితాన్నిచ్చునో ? విధివ్రాత ఎలాగున్నదో' అని యీ విధముగా విలపిస్తుంది.

'ఘనుడా భూసురుడేగెనో నడుమ మార్గశ్రాంతుడై
చిక్కెనో
వినికృష్ణుండిది తప్పుగా దలచెనో విచ్చేయునో
యీశ్వరుం
డనుకూలింపదలంచునో తలపఁడో యార్యా
మహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెరుగదో నాభాగ్య
మెట్లున్నదో
[భాగవతం దశమస్కంధం పూర్వభాగం-1724]

అన్న ఈ పద్యమే కొలది మార్పులతో తిమ్మన్న చేతిలోపడి

వెన్నునిచెంత నప్పదమి వేలుపు మానిక మేమి
తెల్పునో
చెన్నుగ నన్నియుఁదెలిసి చెల్వుడు దానెటుగా
దలంచునో
క్రొన్నెల తాల్పుముద్దియను గూర్చి యొనర్చిన
నోములిప్పుడే
వన్నెనుబండునో నలువవ్రాత తెఱంగిక నెట్టు
లుండునో(1 166)

అన్న పద్యంగా తయారయిందనుట నిస్సంశయం. రుక్మిణీదేవి కృష్ణవిరహంతో ఇట్లున్నదట.

మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ
జలముల నాడదు జలజగంధి.

దీని ప్రభావముతో తిమ్మన

'అద్దంబుగని తద్దనిద్దంపుఁ గస్తురి
ముద్దునెన్నొసలిపై దిద్దవేమి?
కుప్పలై కప్పున నొప్పారు పెన్నెఱు
లింపుగా దువ్వి పాటింపవేమి?' (2-88) అని

విరహిణియయిన నీలను ఆమె చెలికత్తెలు ప్రశ్నించినట్టి ఈ పద్యం వ్రాసినాడు.

కృష్ణుని రాకను చూచుచున్న మధురానగర ప్రజలీవిధంగా అనుకున్నారని పోతన భాగవతంలో ఇలా వ్రాశాడు.

'వీడటే రక్కసి విగత జీవగఁ జన్ను
బాలుద్రావిన మేటి బాలకుండు
వీడటే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాడు.
వీడటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు
వీడటే యెలయించి వ్రేతల మానంబు
చూఱ లాడిన లోక సుందరుండు'
(భాగవత దశమస్కధ పూర్వభాగం-1248)

దానిని అనుసరించి తిమ్మన
'వీడెపో యే ప్రొద్దు వ్రేపల్లెలో గొల్ల
మగువల వలపించు సొగసుకాడు
వీడెపో చెలరేగి విసపుపాలిడుఁజాగ
రక్కసి దునిమిన యుక్కు దునియ
వీడెపో నందుని విరిబోడిముందర
మొనసి చిందులు త్రొక్కు ముద్దులాడు
వీడెపో బండి తొల్వేలుపునుంకించి
పిండిగాఁ దన్నిన దండిజోదు.
వీడెపో వ్రేలఁగీముల వెన్నుజున్ను
గముల గొల్లగ మెక్కిన గండి దొంగ' (3-52)

పోతన సీసములోని ప్రథమ పాదము నందలి భావమే తిమ్మన సీసములో రెండవ పాదములో చెప్పబడింది. పోతన పద్యంలోని మూడవపాదం తిమ్మన తేటగీతలో సీటుగా కుదిరింది. పోతనగారు (వాడిన) చన్నుబాలు, ముద్దులాడు, దాపరీడు, చూఱలాడు' వంటి తేనెలొలుకు తెలుగు పదాలతో తులతూగు 'సొగసుకాడు, ఉక్కుదునియ, ముద్దులాడు, గండి దొంగ' వంటి చక్కని చిక్కని తెలుగు పదాలతో తిమ్మన తన పద్యము నలంకరించినాడు.

అంతేగాక పోతన పద్యాల్లో జగత్ప్రఖ్యాత మయిన 'మందార మకరంద మాధుర్యమున దేలు' అనే పద్యాని ఆదే పక్కలో మక్కువతో తానే మరల వ్రాసిన 'సీరదాగమ మేఘ నిర్గత్' అనే పద్యాన్ని మందార మకరంద బిందు మాధుర్యములు తొణికే తేటతెనుగులో ఒకే సీసములోనికి అనుసరించి అనువదించిన వైఖరి చూడండి

"మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీ హారములకు"
భాగవతం (సప్తమ స్కంధం-150

"నీరదాగమ మేఘ నిర్ముక్తప్రయః పాన
చాతకం బేగునే చౌటి పడెకుఁ
బరిపక్వమాకంద ఫలరసంబులు గ్రోలు
కీరముల్ చనునె దుత్తూరములకు
ఘనరవాకర్ణనోత్కలిక మయూరముల్

గోరునే కఠినఝిల్లీరవంబుఁ
గరికుంభ పిశిత సద్గ్రాస మోదితసింహ
మరుగునే శునక మాంసాభిలాషఁ
బ్రవిమలాకార! భవదీయ పాదపద్మ
యుగసమాశ్రయ నైపుణోద్యోగ చిత్త
మన్యు జేరునే తనకుపాస్యంబుగాఁగ
భక్తమందార! దుర్భరవిదూర!"
(భాగవత దశమస్కంధోత్తర భాగం -257)

ఈ రెంటి సమ్మేళనంతో ఆవిర్భవించిన తిమ్మన పద్యం చూడండి

దట్టంపు మిన్వాక తరగ చాల్పున దేలు
తెలిపుల్గు బురదగోతులకు జనునె?
పుడుకు బ్రాన్వలి తావి పువ్వుఁదేనియలాను
మగతేఁటి తుమ్మ కొమ్మలకు ఁజనునె?
తొలుమొగుళ్లిడు చిన్కు లెలమిఁ గ్రోల్వానకో
యిల బలుమంచు సోనలకు జనునె?
పరువంపు ఁ గొమ్మావి పండులేపునమెక్కు
చిలుక గాటపుటుమ్మె తలకు జనునె?
పక్కి రాజక్కిదొర చెల్మి ఁజక్కగోరి
చొక్కు చుఁడెడు డెందమమ్మక్క యొక్క
తులువ మానిసి తోడఁబొందునకు నిచ్చ
యిడగ ఁజూచునెతలప నెయ్యెడలనైన? (2-76)

పోతన మందార మకరంద ప్రసక్తి తిమ్మన సీస పద్యం రెండవ పాదంలో వచ్చింది. కాని అందలి మదనములకు బదులు 'తుమ్మ కొమ్మల' ను తిమ్మన తన స్వీయ ముద్ర కోసము వాడినాడు. పోతన పద్యము నందలి గంగా నదీ ప్రసక్తి తిమ్మన పద్యం ఆది చరణం లోనే వచ్చింది. కాని పోతన 'తరంగిణి' తిమ్మన పద్యములో 'బురదగోతి'గా మారింది. ఈ మార్పుతో పద్యానికి అందం హెచ్చింది. హంసకు సామాన్య తరంగిణి కూడ ప్రవేశార్హమే కాని బురద గుంట కానేకాదు కదా. పోతన గారి ద్వితీయ సీసము లోని చాతక ప్రసక్తి తిమ్మన పద్యంలో మూడవ పాదమున వచ్చింది. మూలము నందలి 'చౌటిపడె' తిమ్మనలో 'మంచుసోన' అయ్యింది. కానీ ఈ మంచు సోన పోతన 'మందార మకరంద' లోని 'సాంద్రనీహార' శబ్దమునకు తెలుగు పలుకు బడియే. పోతన గారి ద్వితీయ సీసము నందలి కీర ప్రసక్తి తిమ్మన పద్యంలో నాల్గవ పాదములో ఉన్నది. కాని మూలము నందలి 'దుత్తూరము' అనుసరణము 'ఉమ్మెత్త'గా మారింది. కానీ ఇది పోతన మొదటి పద్యంలోని మదన శబ్దానికి అనువాదమే. ఈ విధంగా పోతన్న గారి రెండు సీసములను బాగా ఒంట పట్టించుకొని తిమ్మన్న ఈ సీస పద్యాన్ని వ్రాసి వున్నాడని మనం ఊహించ వచ్చును.

ఇంత వరకు పోతన్న పోతలో తిమ్మన్న కలం వాడిని చూచినాము. ఇతనిపై దక్షిణాంధ్ర యుగంలో వెలసి చేవగల కవిత్వం చెప్పి రఘునాథరాయల నొప్పించి మెప్పించిన చేమకూర వేంకటకవి ప్రభావం ఎలావుందో చూతము.

'చక్కెర వింటి రాజు నెక సక్కెము లాడగజాలు
(విజయ విలాసం 3-99)

అన్న చామకూరవారి వాక్య భాగాన్ని యథాతథంగా 'చక్కెర విఁటి జోదు నెకసక్కెము లాడగ జాలు పక్కిరాజక్కి వజీరు' (2-97) అని ప్రయోగించాడు తిమ్మన.

ఇలాగా పదబంధాలనేకాక చేమకూర వ్రాసిన పద్యాల నడకకు మురిసి అదే త్రోవలో అదే అలంకారాలతో వ్రాసిన పద్యాలుకూడ ఉన్నాయి. మచ్చు కొకటి.

నువ్వుఁబువ్వునవ్వు జవ్వనినాసిక
చివురు సవురు జవురునువిద మోవి
మెబ్బునుబ్బుగెబ్బు బిబ్బోకవతి వేణి
మెఱుపు నొఱపు బఱపుఁదెఱపమేను.

(విజయ విలాసం 1-84)

ఇంక తిమ్మనపద్యం చూడండి.

కెంపు బెంపడంప సొంపగువాతెఱ
మిన్నుఁజెన్ను నెన్నుకన్నె నడుము
మీలనేలఁజాలు వాలుగన్నుంగవ
తేటి దాటు మీటు బోటి కురులు

నీలాసుందరీ పరిణయం 2-10)

విజయ విలాస పద్యము స్త్రీ వర్ణనమే. తిమ్మన పద్యమూ స్త్రీ వర్ణనమే. అందునా వృత్త్యను ప్రాస మున్నది. ఇందునూ వృత్త్యను ప్రాసమున్నది. ఆ పద్యమూ ఆటవెలదే ఈ పద్యమూ ఆటవెలదియే.

పైన శబ్దాలంకారానుసరణ చూచితిమి. ఇంక అర్థాలంకార అను సరణ చూతము.

ప్రక్క-ప్రక్కన కూరుచున్న వధూవరులయిన సుభద్రార్జునులను గూర్చి చేయకూరవారు ఈ పద్యం వ్రాశారు.

మృగమదము చెంతఁగుంగుమరేఖవోలె
నీలమణి పొంతనుదిరి ప్రొనేకు వోలె
మేఘముకుఱంగటను దీఁగెమెఱుపువోలె
నర్జునున చెంగట సుభద్రయలరెనపుడు

(విజయ విలాసం 3-118)

నందుడంపిన విప్రపుంగవుడు నీలాసుందరిని చూచి వచ్చిన తర్వాత ఆమె అందచందాలను శ్రీకృష్ణుని చెంత వర్ణించి కడపటచెప్పే పద్యంలో చేమకూర పద్యంలోని రెండవ పాదంలోని ఉపమానాన్ని స్వొంతం చేసుకొని తిమ్మన వాడుకున్న తీరుచూడండి.

చెలువుడ! నీ యెడంజెవులు చీఁదఱఁజెందగఁ
బెక్కు-లాగులా
బలుగకనేల? యాతలిరు బ్రాయపుటన్నుల
మిన్న చెల్మి నీ
కలవడనేని మేలి పడియాఱవ వన్నె పసిండి
తోడవే
ల్పుల దొరమానికంపురవఁబొందుగఁ గూర్చిన
చందమౌఱుమీ (2-30)

ఇందలి ఉపమానం సందర్భోచితంగా ఉంది. ఆమె బంగారపు చాయతో సిగనిగ లాడెసింగారి. కృష్ణుడో నీలమేఘ శ్యామసుందరుడు వీరి కలయిక నీలపు రాయితాపిన మంచి బంగారమువలె ఉంటుందట. వారి శరీర వర్ణాలకు చెప్పిన ఉపమానాలు సరసంగా ఆతు కుతూహలిత మనస్సులకు ఆనందాన్ని కలిగిస్తున్నా యనటానికి సందేహంలేదు.

ఇట్టి వర్ణనలేకాక ఈ కవికూడ ప్రాచీన కవులవలె సీస పద్యాలలో అనేక విలాసాలాను చూపించాడు. చూడండి.

'ఎవ్వాని వాకిట నిభమదపంకంబు రాజభూషణ రజోరాజినడగు' అని తిక్కన ప్రశ్నార్థక సర్వనామ ముతో ఆరంభించినట్లు.

'ఏవేల్పుగుదెతాల్పు తీవంచ మోముల
తులువలబులుక్రొవ్వు దొలగమీచె

(1-12)

ప్రతి సీస పాదార్థమును అసమాప క్రియతో ముగిస్తూ

'పసిదిండిమెకపు రక్కసి దోలు మొలజుట్టి
కేలమువ్మొన వాలుగీలుకొల్పి' (1-13)

ప్రతిసీస పాదార్థమును అంత్యప్రాసముతో అలంక రిసూ

'గొనలూరు నూగారు కొదమతుమ్మెదబారు
బలుగుబ్బపాలిండ్లు పసిడిగిండ్లు' (1-56)
'వేపల్లె నుండి మున్నేపుతోనిచటికి
నేలవేలుపు పెద్దయేలవచ్చె ?
వచ్చి మచ్చిక మీఱ హెచ్చుగా హాటట్టు
సాలుదాలుపుఁగతలేల తెలిపె?' (1-78)

అని ముక్తపదగ్రస్తంతో అలంకరుస్తూ.

మరియు 'తలయూచుఁ దనలోనఁదాన నవ్వుఁగలంగుఁ
గలవరించును బయల్ గౌగిలించు'

అని అలతి అలతి వాక్యాలతో నింపుతూ,

'కొఱమాలి విసమిడ్డ కఱకురక్కసిఁజెండి
పఱపు మీఁదెడు బండివిఱుఁగఁ దొక్కి
వెఱఁగొప్ప వ్రేతల మొఱఁగివెన్నలు మెక్కి
తఱిసూచి మద్దులు పెఱికివైచి' (0-18)

అని పద్యమునంతట ప్రాసనియమాన్ని పాటిస్తూ - ఎన్నో విధములుగా సీస పద్యాలను నడిపించాడు.

అంతేగాక యీయన శుద్ధాంధ్రంలో ఉత్సాహ, దండకము, మాలిని, లయగ్రాహి, తరళము-వంటి వివిధచ్ఛందస్సులను అందంగా సునాయాసంగా నడిపి తనకు గల వృత్తరచనా ప్రావీణ్యాన్ని ప్రదర్శించాడు.

ఒకేరకమైన కథ వ్రాసేటప్పుడు అనుకరించ కుండా ఉండడం అనేది అసాధ్యమయినపని. అంతే గాక తిమ్మన తనకు పూర్వమున్న కావ్యాలన్నీ కడు లెస్సగా చదివిన పండితుడు కనుక. తలవని తలంపు గనే ఆయన మదినుండి అవే భావాలు ఎడనెడ వచ్చి యుండవచ్చును. అయినా యితని కవితా ప్రవాహ ములో బడిపోవు పాఠకునికి యీయన అనుకరించి నట్లు కనబడదు. ఆయన ఇతరుల కు అనుకరించినను తనదిగా చేసుకొనగల మహా సామర్థ్యమున్నకవి.

రాజశేఖరుడు అను లాక్షణిక శిఖామణి చెప్పిన యీ శ్లోకమాయన యెడల సార్థకం.

నాస్త్య చౌరః కవిజనో
నాస్త్య చౌరోవణిగ్జనః
సనన్దతి వినావాచ్యం
యోజానాతినిగూహితుమ్

(చౌర్యము చేయని కవిలేడు. చోరుడుకాని వర్త కుడు లేడు. దొంగతనమును ఎట్లు కప్పుకొనవలెనో తెలిసినవాడు నిందలపాలుగాకుండ ఆనందించును.)

కూచిమంచి తిమ్మన దశాధిక కృతులు వ్రాసిన మహాకవి. అయినా ఆయన రసికజన మనోభిరామం వంటి కావ్యాల్లో భాషాయోషను శ్లేషాశ్లేషములతో ఉక్కిరి బిక్కిరి చేసినాడు. యమకాల గమకాలతో ఆయాస పెట్టినాడు. అచ్చ తెనుగు రామాయణంలో కూడ ఆయన అట్లే శబ్దాలంకారములపై మోజును అధికంగా చూపినాడు. కాని అట్టి పదవ్యామోహము నకు లోనుగాక తేనెలూరు తేటతెనుగు పలుకు బళ్లతో నీలాసుందరీ పరిణయాన్ని మాత్రమే మధుర ప్రబం ధంగా మలచినాడు. కాలగర్భంలో కలిసిపోక ఈ కావ్యము మాత్రం కలకాలం నిలబడగలదు. ఆ మహా యశఃకాయాన్ని కాపాడే వజ్రకవచ మీకావ్యమనడాని ఏ మాత్రము సందేహ పడవలసిన పనిలేదు.

7-193 కోర్టురోడ్డు
అనంతపురం 515 004

# సామాన్య పాఠకులూ : శ్రీశ్రీ .

— మానేపల్లి

మరణించి సంవత్సరం అయింది సంస్మరణ సభలూ, వర్ధంతులూ జరుగుతున్నాయి. అర్ధశతాబ్దానికి పైగా తెలుగు సాహిత్యాకాశంలో అసమాన కాంతితో ప్రకాశించి ప్రభావితం చేసిన మహాకవి సూర్యుడికి నివాళుల దివిటీలు పడుతున్నారు అభిమానులు. ఆయన సిద్ధాంతానికి వారసులైన యువతరం, ముందుతున్నతరం, అరుణారుణతరంగం-లక్ష్యసాధనకు బిగించినపిడికిలితో రాజీలేని పోరాటం సాగిస్తూనే వున్నారు.

సాహిత్య పిపాసువులం లేక పాఠకులం అనుకున్న మధ్యతరగతి జనం, రచనాలోకంలో ఉద్యమిస్తున్న నవతరం- శ్రీశ్రీ మా అభిమానకవి అని సంతోషంగానూ గర్వంగానూ చెప్పుకుంటున్నారు. శ్రీశ్రీ పేరు విన్న అసంఖ్యాక ఇతరజనం కూడా వున్నారు పీరిలో ఎందరు ఆయన రచనలను కూలంకషంగా చదివారు? (కనీసం చూశారా ?), ఎందుకు వాటిలోని ప్రాణభూతమైన సందేశాన్ని ఒంటబట్టించుకున్నారు ? మరెందరు ఆ మహాకవి సిద్ధాంతాన్ని ఆచరణలో పెడుతున్నారూ ?

ఆయన సిద్ధాంతవారసులైన-పిడికిలి బిగించిన యువతరం ఆయన రచనల్ని చదవతున్నా-మౌలికమైన వాటిని అధ్యయనం చేస్తున్నారు. అంతకంటె బహుశా అయనకంటె ఎక్కువగా - ఆచరణలో పెట్టి లక్ష్యసాధనకు ప్రాణాలు బలిపెడుతున్నారు. నూతన ప్రజాస్వామికవ్యవస్థ నిర్మాణానికి అవిశ్రాంతంగా కృషిచేస్తున్నారు. సాహిత్యాన్ని-సమకాలిక జీవిత సమస్యలతో జోడించి-పరిష్కారం దిశగా పయనిస్తున్న ఈ యువతరం, సిస్సందేహంగా ప్రథమశ్రేణి మానవులు. కేవలం శ్రీశ్రీ సిద్ధాంతం ప్రకారం మాత్రమే కాదు-వందలసంవత్సరాల క్రితంనాటి భర్తృహరి సిద్ధాంతం ప్రకారం చూసినా ఇవి నిజం.

ఇక, మేం సాహిత్యపిపాసువులం అని చెప్పుకునే వారున్నారు. వీరు శ్రీశ్రీ రచనల్లో మహాప్రస్థానం, ఖడ్గసృష్టి—లేదా మరికొన్ని తొలి, మలి రచనలు చదివి వుంటారు. ఆనందించి ఉంటారు. వేడి తగ్గకముందు కొద్దిగా ఆందోళనపడి, మరి కొద్దిగా ఆలోచనచేసి కూడా వుంటారు. వారిలో దాదాపు అందరూ ఇప్పుడు చల్లారిపోయిన నిప్పులు. వారి దృష్టిలో నన్నయ ఎటువంటివారో, శ్రీనాథుడెటువంటివారో శ్రీశ్రీ కూడా అటువంటివాడే. గొప్ప సాహిత్యస్రష్ట. వాళ్లకు మహాప్రస్థానం మహాయిష్టం అందులో కొన్ని కవితలు అప్పుడప్పుడు టెక్స్టు పుస్తకాల్లో కనపడితే ఆనందిస్తారు. ఇన్నాళ్ళకు మన ప్రభుత్వం/లేక యూనివర్శిటీ—ఎంత మంచి పని చేసింది అనుకుంటారు. ఖడ్గసృష్టిలోని ప్రయోగాలు అర్థంకావు. గాని ఆ చమత్కారాలు బావుంటాయి. ఇక ప్రాసక్రీడలు, విమఋక్కులు, సిరిసిరిమువ్వశతకం — ఇత్యాదులు చాలా సరదాగా వుంటాయి. వాటిల్లోని చురకలు చదువుకుని నవ్వేస్తుకుంటారు [The laugh them off to avoid them]. ఆచంట జానకిరాం వంటి అనేకులకు అవి అంతబాగోవు. స్వర్గదేవతలు....ఆ తరువాత దేశచరిత్రలు వ్రాసినమహాకవి "అరవ్వాడి దోశై, ఏదో

ఒకటి వ్రాశై" వంటివి వ్రాయడం దురదృష్ట కరం అని వారి అభిప్రాయం.

పొడిచేస్తామని చెప్పిన
మన కాంగ్రెసువారు
తడి రాష్ట్రాలన్నిటినీ

పొడి చేసేశారు—వంటివి వారిదృష్టికి ఆనవు. లేక సౌకర్యార్థం దృష్టి అటుతిప్పరు.

'చరమరాత్రి అనే కథంసంపుటి శ్రీశ్రీది వుందని కొందరికి తెలియదు. చదివిన కొద్దిమందికి మింగుడుపడదు. వాళ్లజనాభా లెక్కల్లో కోనేటిరావు వుండడు. సాక్షాత్తు కోనేటిరావే చదివినా శ్రీశ్రీ తమకోసమే రాశాడన్న స్పృహ వారికుండదు.

తప్పించుకుందామన్న వల్లగాకుండా శ్రీశ్రీ సంపుటాల్లోకి ఎక్కికూచున్న ఎన్నోరచనల్ని చదువుతారు, పాపం.

అబ్బా శ్రీశ్రీ ఎన్ని గొప్ప రచనలు చేశారు నిజంగా మహాకవే అంటారు. రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ చేసిన ఘోరాలన్నీ సినిమాల్లో చూసి - 'అయ్యో' అనుకుని, ఇవతలికి వచ్చి అన్నీ మరచిపోయే తత్త్వం వీళ్లది. వీరుశ్రీశ్రీ ని మహాకవినీ, మహాపురుషుణ్ణి చేసేసి పూజిస్తారు. వీరి పూజ శ్రీశ్రీ కి హానికరం అనే అనుకోవాలి.

వీళ్ళు 1970 తరువాత శ్రీశ్రీ రచల్ని సిద్ధాంత పరంగానూ అంగీకరించరు. సాహిత్య పరంగానూ అంగీకరించరు.

సాయుధ విప్లవ సారథినై...
...మంటలచేత మాట్లాడిస్తాను.
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను.

అంటున్నాడు శ్రీశ్రీ 1970 తరువాత నుంచీ. ఆయన అభిమానులకు మంటలూ, రక్తమూ కొత్త కాదుగాని-అట్లా 'సాయుధ విప్లవం' మాత్రం నచ్చదు మరోప్రస్థానం గురించి అనేక మంది పెద్ద మనుషులు విని వుండరు. ఆ పుస్తకం చూసినా చదివి వుండరు. చదివినా పెదవి విరిచి ఎవరి దగ్గరో పారేసి వుంటారు. పిదపకాలం, పిదప బుద్ధులు-అనుకుని వుంటారు. కుక్కమూతి పిందెలు అని ఈసడించి వుంటారు. మరి వీరు చేసే 'శ్రీశ్రీ పూజ' ఆయననే కాదు శ్రీశ్రీకి కూడా హానికరం కాదూ?

కేవలం వారపత్రికలూ, అందులోనూ సీరియస్ నవలలు (ఈ మధ్య నవలలు సీరియస్‌గా వుంటున్నా యట) చదివే మధ్య తరగతి ఇల్లాళ్ళున్నారు-మరెందరో కాలక్షేపం పాఠకులున్నారు. (వీళ్ళు సీరియస్ నవలలు, సినిమా వార్తలు, వారపత్రికలు, జోకులు కార్టూన్లు తప్ప తక్కినవి సాధారణంగా చదవరు. కావాలంటే చూస్కోటానికి) తెలుగు పాఠకులలో 80 శాతం వీళ్ళే. తెలుగు పత్రికారంగం భవితవ్యం (సాహిత్య భవితవ్యం అనే కొందరు సూచిస్తున్నారు) వీళ్ళ మీదే వుంది. వీళ్ళలో మార్పు తెచ్చిభావ విప్లవాన్ని సాధించాలని కూడా శ్రీశ్రీ ఆశయమే. మరి వీరు శ్రీశ్రీ పేరు విని వుంటారు గాని (వినకపోయినా ఆశ్చర్య పడొద్దు) శ్రీశ్రీ రచన ఒక్కటి కూడా చదివి వుండరు. కారణాలు ఏమిటయి వుంటాయి? వీళ్ళు చదవడానికి వీలయ్యేరకంగా ఆయన కథలు రాయలేదు. నవల ఒక్కటి కూడా రాయలేదు. ఉన్న ఒక్కగానొక్క కథల పుస్తకమయినా వీళ్ళకు చదువుదాం అనిపించేలా వుండదు. (అడామగా కలిసిన ప్రేమ ముఖచిత్రం, అందమైన పేరు వుంటే తప్ప వీరు ఏ పుస్తకమూ చదవరు) మరి వీళ్ళచేత శ్రీశ్రీ రచనలు చదివించడం ఎలాగ? ముఖ చిత్రం మార్చి-లోపల కూడా బొమ్మలు వేసి-శ్రీశ్రీ రచనల సంపుటంలోంచి వెదికి మరికొన్ని కథలు కూడా చేర్చి వీలయితే పేరు మార్చి-ఆకర్షణీయంగా అచ్చువెయ్యాలి

అందుబాటులో వుండే ధరకు అమ్మాలి. ఈ పని చెయ్యడం ఆశయాలకు భంగం ఎంత మాత్రం కాదు.

ఏ మాటకామాటే చెప్పుకోవాలి- రేడియో వాళ్ళు చాలా మంచిపని చేస్తున్నారు. మూడు పూటల్లోనూ ఏదో ఒక పూట బూతుపాటల మధ్యనైనా సరే- రోజూ ఒక శ్రీశ్రీ పాట వేస్తున్నారు. అయితే ఇందులో ఒక చిక్కుంది. సినిమా పేరూ, పాడిన వాళ్ళ పేరు, ఆ పాటను తెరమీద నటించిన వాళ్ళ పేర్లు గుర్తుంటాయి గాని—రాసిన వాళ్ళ పేరు గుర్తుండదు. (ఫుల్ పేజీ సినిమా ప్రకటనల్లోనే ఒక సారి రచయిత పేరుండదు వాల్ పోస్టరు మీద ఎలాగూ వుండదు లెండి) కొందరయినా గుర్తుంచు కుంటారని కాస్సేపు సంతృప్తి పడదాం కాని- ఈ శతాబ్దం మారాక రేడియో వాళ్ళు శ్రీశ్రీ పాటలు వేస్తారని నమ్మకం లేదు. (ఒకనాటి సినిమాల్లోని బలిజెపల్లి లక్ష్మీకాంతం వగైరాదుల పాటలూ పద్యాలు ఇప్పుడు వినబడటం లేదు. అవి గొప్పవి కాకపోవచ్చు రామప్పంతులన్నట్టు అది వేరే కథ) కనీసం సినిమా పాటలయినా సామాన్య జనం మధ్య నాలుగు కాలాల పాటు నిలబడేలా చెయ్యాలంటే ఏమిటి సాధనం? శ్రీశ్రీ సినిమా పాటల పుస్తకాల్ని సినిమా బొమ్మల్తో సహా (ఆ బొమ్మల్లో బోలెడు చరిత్ర వుందడీ) ముద్రించి స్వరసమైన ధరలకు అందజేస్తే- శ్రీశ్రీ పేరూనిలుస్తుంది కొంతలో కొంత ఆయన ఆశయాలను ప్రచారమూ లభిస్తుంది. ఆయన సినిమా పాటల సమగ్ర సంపుటాలు లేని లోటుకూడా తీరవచ్చు.

ప్రాసక్రీడలు, సిరిసిరిమువ్వ శతకం, విచు బుక్కులు వగైరాలన్ని జాగ్రత్తగా ఎడిట్ చేసి ప్రతి పేజీతోనూ కార్టూన్లు జోడించి ప్రచురిస్తే జోకుల పుస్తకాల్లోలాగా బాగా అమ్ముడవుతాయని అనిపిస్తోంది.

కథలు-సినిమా పాటలు వంగ్య పద్యాలూ వీటి తరువాతనే- శ్రీశ్రీ తక్కిన రచనలు మధ్య తరగతి చదువరులకు అలవాటు చెయ్యాలి.

ఇదిలా వుండగా కాస్త స్థాయి ఎక్కువవున్న మధ్య తరగతి పాఠకులకు శ్రీశ్రీ మూడు కావ్యాలూ కలిపి అందించాలి చలం గారి యోగ్యతా పత్రంతో సహా మహాప్రస్థానం, కొద్దికొద్ది వివరణలతో ఖడ్గ సృష్టి, కొంత సైద్ధాంతిక, చారిత్రక నేపథ్యంలో మరో ప్రస్థానం-కలిపి ముద్రించాలి, శ్రీశ్రీ ఫోటో, శ్రీశ్రీ దస్తూరీ తప్పని సరిగా వుండాలి. మూడూ కలిపి ఎందుకు ముద్రించడం అని మీరడగొచ్చు. ఒకటి చదివి మరోటి వదిలేసే ప్రమాదం తగ్గుతుంది. రెండో దేమిటంటే—శ్రీశ్రీ ఆలోచనా సరళిలోని క్రమ పరిణామం (అది తెలుగు కవిత క్రమ పరిణామమే) స్పష్టంగా కనిపిస్తుంది, ముఖ్యమైన మూడో ప్రయోజనం ఏమిటంటే, నూతన ప్రజాస్వామిక వ్యవస్థ కోసం జరుగుతున్న ప్రజాఉద్యమ ప్రచారానికి గొప్ప సాధనంగా ఉండగలదు. ఈ మహాగ్రంధం ఎవరైనా రూపొందించి ప్రచురిస్తే, రెండు చేతులా ఆహ్వానించే వాళ్ళలో నేను ముందుంటాను.

అసలు—

షష్టిపూర్తికి తయారైన శ్రీశ్రీ సంపుటాల్ని (ఆయా కాలాలకు సంబంధించిన రచనలు దొరికితే జోడించి) మళ్ళి అచ్చు వెయ్యాలి. ఆ తరువాత 15.6.1983 వరకు గల ఆయన రచనల్ని అదే ప్రణాళిక మీద ముద్రించాలి, ప్రచురించే రచనల్లో కంటె ప్రచురణకు ఇవ్వని వ్యక్తిగత లేఖల్లో చాలా

అంశాలుంటాయి. అంచేత శ్రీశ్రీ లేఖలన్నీ సంపుటాలుగా అచ్చు పడాలి.

లేఖలు, రచనలు, నిర్దుష్టమైన పత్రికా ప్రకటనలు ఆధారంగా శ్రీశ్రీ జీవితచరిత్ర సచిత్రంగా రూపొందించ బడాలి.

వ్యక్తుల ఉద్దేశాలు కుటుంబ సభ్యులైనా సరే- ఈ గ్రంథంలో ప్రతి ఫలించ కూడదు. శ్రీశ్రీ మాత్రమే ప్రతి ఫలించాలి(అంటే ఆయన ఉద్దేశాలు, ఆశయాలు, కృషి వగైరా)

ఇదే పరిస్థితితో శ్రీశ్రీ చిత్రం కూడాను.

శ్రీశ్రీ విగ్రహం విశాఖపట్నం ఏవీయన్ కాలేజీ పక్కనున్న కొండ మీద ప్రతిష్ఠించాలి. అది వీలయినంత పెద్దదిగా వుండాలి. చేయెత్తి పిడికిలి బిగించి వున్నట్టుండాలి. దూర తీరాల్నించి వచ్చే సముద్ర ప్రయాణీకుల్ని విశాఖ తీరానికి ఆహ్వానిస్తున్నట్టుండాలి. న్యూయార్క్‌లో లిబర్టీ విగ్రహంలా వుండాలి. అది ఆ కొండమీదే ఎందుకుంమలంటే- శ్రీశ్రీ పుట్టిన స్థలం అక్కడికి దగ్గరే గనుక, అది చాలా ఎత్తయిన ప్రదేశం కనుక, విదేశస్థుల్ని ఆహ్వానిస్తున్నట్టు కూడా వుంటుంది కనుక ఆ విగ్రహం చుట్టూ చిన్న పార్కు- ఉండాలి. కాలేజీ రోడ్డునుంచి అక్కడికి చక్కని తోవ వుండాలి.

శ్రీశ్రీ రచనలు, ఆయనస్మృతులు మనసులో మెదిలేసరికి ఈ అంశాలన్నీ రాయాలనిపించింది. ఇందలి మంచి చెడ్డలను, సాధ్యాసాధ్యాలను చర్చించ వలసినది అశేషాంధ్ర ప్రజానీకం!

# మనవి

స్రవంతి" చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడు తమ చందానెంబరును తప్పక ఉదహరించ ప్రార్థన.

# జానపద సాహిత్యం–పొలం పనిపాటలు

— ఎర్ల బాలకృష్ణారెడ్డి

'పల్లెపదం మంచిది విన్నప్పుడు
ఝల్లు మంటుంది దేశీయుని గుండె'

—ఆరుద్ర.

జనపదమంటే పల్లెటూరు. జనపదాలలో ఉండే వారు జానపదులు. వీరు ఆధునిక సంపర్కం, చదువు సంధ్యలు లేని సామాన్యజనులు వీరు పాడుకొనేపాటలే జానపదగేయాలు. వీటినే పల్లెపదాలని కూడా అంటారు.

స్పందన కలిగినపుడు భావుకుడైన కవి తన అనుభూతిని ప్రయత్నంతో కవిత్వంగా రూపొందిస్తాడు. 'రెక్కాడితేగాని డొక్కాడని కర్షక కార్మికులకు విశ్రాంతి యెరుగని ఆ రెక్కలే దిక్కు. వారి కష్ట సుఖాలు వారిలో వారే చెప్పుకోవాలి. హృదయంలో ఉన్న ఆనందమో దుఃఖమో కష్టమో పైకి వెళ్ళ బుచ్చుకుంటేనేగాని హృదయభారం తీరదు. ఇదే జానపద కవిత్వంగా వెలువడింది.'[1]

ఏ భాషాసాహిత్యంలో నైనా శ్రోతనుగాని, పఠితనుగాని రసప్రపంచయాత్ర చేయించగలిగేది జానపద గేయాలే. రససిద్ధి కలిగించుటలో ఏ నాగరిక సాహిత్యానికీ ఇది తీసిపోదు.

జానపదగేయ సాహిత్య పరిధి చాలా విస్తృతం. విషయ సౌలభ్యందృష్ట్యా వీటిని లౌకికగేయాలు, అలౌకిక గేయాలు (పారమార్థిక) అని స్థూలంగా విభజించవచ్చు. మొదటిది మానవుని లౌకిక జీవితానికి సంబంధించినవీ, రెండోవి మానవాతీత శక్తులపై మనిషికున్న నమ్మకానికి చెందినవి. ఈ ఒక్కొక్క వర్గీకరణ రెండుతెగలు. కథాసహితాలు. కథారహితాలు. కథారహితగేయాలనే ముక్తకాలంటారు. ముక్తక లౌకికగేయాలలో పనిపాటలు ఒకతెగ. ఈపనిపాటలు మూడు రకాలు. ఒకటి కర్షకుల పనిపాటలు. రెండు కార్మికుల పనిపాటలు. మూడు గృహసంబంధి పనిపాటలు. కర్షకుల పనిపాటలను వివరించడం ప్రస్తుత వ్యాసోద్దేశం. వీటినే పొలంపని పాటలని కూడా అంటారు.

జానపదులలో సోమరికి చోటులేదు. "ఏపని చెయ్యని నా బట్టకు బువ్వెవరు పెడతారు ? బువ్వెవరు పెడతారు ? అని అంటుంది ఓ జానపద స్త్రీ. జానపదులకు పనేప్రాణం. పనికి పాటకు దగ్గర సంబంధం వుంది. పనిలో కనిపించే శరీరవిన్యాసాలకు అనుగుణంగా లయబద్ధంగా ఆవేశ అనుభూతులే ప్రాణంగా పాట అవతరిస్తుంది. కొన్నిపనులూ, పాటలూ పడుగు పేకలవలె అల్లుకొని ఉంటాయి. శ్రమతెలియకుండా పనిజరగడానికి ఈ పాటలెంతో ఉపకరిస్తాయి.

### పొలం పని పాటలు :-

పొలంలో కాయకష్టంచేసేవారు పాడుకొనే పాటలు పొలం పని పాటలు. ఇందలి ఇతివృత్తం వ్యవసాయ సంబంధ కార్యక్రమాలు. వానపాటలు, ఏరువాక పాటలు, కలుపుతీత పాటలు, గడ్డి పాటలు, కోత పాటలు, పొలిపాటలు, ఊడ్పు పాటలు మొదలగునవి పొలం పాటల కింద చేరుతాయి.

**వాన పాటలు :-**

రైతుకు బంగారుపంటపండాలంటే వాన ముఖ్యం. అందుకే వానలు కురవాలని, వరిచేలు బాగా పండి తమ దారిద్ర్యం పోవాలని జానపదులు కోరుకుంటారు.

'వానల్లు కురవాలి వానదేముడా
వరిచేలు పండాలి వానదేముడా
నల్లాని మేఘాలు వానదేముడా
'చల్లంగ కురవాలి వానదేముడా' — అని

వరుణ దేవున్ని ప్రార్థిస్తారు. 'సర్వేజనాస్సుఖినో భవంతు' అన్న ఆర్యోక్తిని అనుసరించి జానపదులు తామేగాక తమచుట్టు ప్రజలు, పేదసాదలు సంతోషంగా బ్రతకాలని వానదేవున్ని కోరుకుంటారు :

'బీదసాద బతకాలి వానదేముడా
పేదసాద బదకాలి వానదేముడా
కూలినాలి దొరకాలి వానదేముడా
కరువంతా పోవాలి వానదేముడా'

తొలకరి వానలు పడగానే ఏరువాక సాగిస్తారు

**ఏరువాక పాటలు :-**

పొలంపనులు ఏరువాకతో ప్రారంభిస్తారు. ఏరు-అంటే ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపరచేనాగలి అని అర్థం. ఏరువాక, అంటే తొలకరివానలు పడినాక ఏటేటచేయు మొదటిదుక్కి. ఆసమయంలో పాడేపాటలు ఏరువాకపాటలు. రైతులు 'ఏరువాక' పండుగ చేస్తారు. నాగలిని పూజించి తొలిదుక్కి దున్నుతారు.

'ఏరువాకమ్మకీ యేమికావాలి
ఎఱ్ఱఎఱ్ఱని పేలమాల కావాలి
ఎరుపు తెలుపులమబ్బు దెండకావాలి

ఎదతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలు కోరి పరవశించాలి'.

ఈపాటలో ఏరువాకమ్మను పూజించుటతోపాటు ఆకాశంలోని ప్రకృతి వర్ణనకూడా ఉంది. వానలు కురిస్తే రైతుకు నిముషం తీరిక ఉండదు ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులై పోతారు. ఆ సమయంలో వాళ్ళ ఉత్సాహాన్ని ఇతరులతో పంచుకోవడానికి—

'ఏరువాక సాగెను రోరన్నో చిన్నన్నా
నీ కష్టమంతా తీరునురోరన్నా రైతన్నా'వంటి

పాటలు పాడుకోవడం కద్దు.

**ఏతాము పాటలు :-**

నీటినితోడే సాధనాల్లో కపిల, ఏతాము ముఖ్యమైనవి. ఒకరు ఏతంకొయ్యను తొక్కుచుండగామరొకరు ఏతంతో, నీరు ముంచిపోస్తారు లయబద్ధంగా జరుగుతుం దీపని శ్రమతెలియకుండా ఉండటానికి ఏతాము త్రొక్కుతూ పాటలు పాడడం పూర్వంనుంచి ఆచారం.

'ఏతాము తోడగా ! నీ
చేతైన సాయమదే తమ్ముడా !' — అనే

పాట సాధారణంగా వినిపిస్తూ ఉంటుంది. వేయిపుట్లు పండించినా, కడుపునిండా కూడు తినడానికి కూడా నోచుకోని కృషీవలుడు తన ఆవేదనను ఓ యాతాం పాటతో వ్యక్తపరచాడు—చూడండి :-

'ఏటికేతంబట్టి ఎయిపుట్లు పండించి
ఎన్నడూ మెతుకెరుగరన్నా-నేను
గంజిలో మెతుకెరుగరన్నా ! ॥ఏటి॥
కాల్లేయి కదుకోక్కని కట్టమీద గూసుంటె
కాకిదన్నీ పాయెరన్నా-కాకి
పిల్లదన్నీ పాయెరన్నా ! ॥ఏటి॥
పోరూకు జాల్లేక పోయికాడ గూకుంటె
పోరదన్నీ పాయెరన్నా-పోరి
తల్లీ దన్నీ పాయె రన్నా ॥ఏటి॥
చక్క పొద్దునలేచి బొక్కెనెత్తుకపోంగ
బొక్కబోర్లా పడితిరన్నా
నాదేటి బ్రతుకాయెరన్నా
నేను నాడె చావక పోతిరన్నా.[2] ॥ఏటి॥

పాపం! వీడెవడో దైవోపహతుడుగా ఉన్నాడు. పితుకుమాట దేవుడెరుగు. కాకిచేత తన్నులు తిన్నాడు. ఈ పాటలో కాకి గ్రామాధికారికి, కాక పిల్ల గ్రామాదికారికారి కొడుకుకు ప్రతీకలు. చివరకు ఆలు బిడ్డలు కూడ అతన్ని హింసించారు. ఈపాటలో ఆ రైతన్న గోడు సువ్యక్తం.

**కపిలె పాటలు :-**

కపిలనే మోట అని కొన్ని ప్రాంతాలలో అంటారు. కపిలతోలుతూ పాడేపాటలు కపిలపాటలు. పెద్ద నదులుగాని, చెరువులుగాని లేక, బావులకింద వ్యవసాయం సాగే, రాయలసీమ, కపిల పాటలకు, పెట్టింది పేరు. ఈ పాటలు ప్రతిదిరెండేసి చరణాలు గల స్వతంత్రగాథ. ఇందెక్కువ శృంగార రస ప్రచురాలు.

'బాయిబాయి గంగమ్మతల్లీ బళ్ళారిదురగమ్మ తల్లీ
బాయిగడ్డనబాలులమ్మా బాగుగా కాపాడుమమ్మా'
ఎద్దులూసన్నెద్దులమ్మా బాలలూ పసిబాలలమ్మా
బావిగడ్డకు వచ్చినాము బాగుగా కాపాడు గంగా'
అని గంగమ్మతల్లి ప్రార్థనతో ప్రారంభించి
'కూడితట్టూ రాముగాడూ-ఎడమ తట్టూభీమగాడూ
అవిరెండూ తొలెటోడు-కుచ్చులా కుల్లాయి వాడూ'
——అంటూ పాడుకుంటూ అలసట మరవటానికి——
'జారుకొప్పూ చిన్నదానా జాగిరీ నడుమూలదానా
జారుకొప్పు జారిపోయే సేరుమల్లెలు సెల్లులాడే
సెనిగపూల చీరదానా సెందరొంకా నుదురుదానా
అంచవంటి నడకదానా మంచు (మనసు) బోయే
మల్లరావే-

అనే శృంగార పదాలు ఆలాపిస్తూ ప్రేయసి తలపులతో శ్రమతెలియకుండ తమ పనిని చేస్తారు.

**నాట్లు పాటలు :-**

దుక్కి పూర్తికాగానే నాట్లు వేస్తారు. వరుసలు తీరి వంగి నాట్లువేస్తూ స్త్రీలుపాడే పాటలివి. ఈ పాటకు ఒకరు పాడుతుండగా మిగిలినవారు వంతపాడుతారు మచ్చునకు ఒకటి

'తొలకర్లు తొంగిచూచె——సిరిసిరిమువ్వా
మొలకలు మొగమెత్తె ——సిరిసిరిమువ్వా
ముచ్చటాళ్ల సాగినపైరు——సిరిసిరిమువ్వా
సరిపోట్లు లీనానె ——సిరిసిరిమువ్వా
పండిన పండాలు —— ,,
పాతళ్ళు నిండాలె —— ,,
మిడుత పోటడకుండ —— ,,
మేడాలు నడపాలె —— సిరిసిరిమువ్వా-అని

లయపదంగా పాడుతూ సరసరా నాట్లువేస్తారు.

**కలుపుతీత పాటలు :-**

కలుపుమొక్కలు తీసేస్తూ పాడేపాటలివి. ఇవి కూడా ఒకరు పాడుతుంటే మిగిలినవారు వంత పాడుతారు. ఇందు కథాగేయాలు, లఘుగేయాలు కూడా కనిపిస్తాయి.

'చిక్కుతూ ఆ కుల్ల వెన్నియ్యలో
శివసుద్దులు గట్టి వెన్నియలో
చిత్తూరు నేబోదు చుట్టాలజూడ
అక్కడెవరున్నారె అంభోజరాజు
మాఅమ్మతమ్ములు మాకు మేనమామలు
మముగన్నతండ్రికి బావమరదులమ్మ"-ఇలా

సాగుతుంది. కలుపుతీత అయిపోతే కోతనాడే కోలాహలం.

**గడ్డి పాటలు :-**

సొంత పొలాలులేని హరిజనస్త్రీలకు గడ్డిమాతల్లి. గడ్డికోసి నగరాల్లో అమ్మడం వాళ్ళకు ఉపాధి. శీతోష్ణ స్థితులకు లొంగని పెద్దపంట గడ్డిపంట. గడ్డికోస్తూ పాడేపాటలలో పేదల అభిమానం చూడండి.

'కడుపు చల్లని తల్లి
గడ్డి మా తల్లి
పిడికిటికి రావమ్మ
కొడవటికి రావే
గడ్డికూడే తింటూ
గడ్డితోనే ఉంటూ
గడ్డిలో ప్రాణమొదలి
కైలాసం చూస్తాము![3]

రాణాప్రతాపుడు రాజ్యం వీడినపుడు గడ్డితో రొట్టెలుచేసి తిన్నాడని చరిత్ర చెపుతుంది.

కోత పాటలు :-

కోతపనికి సంబంధించిన పాటలివి. జానపదులలో యజమాని, కూలి అనే తారతమ్యం కనిపించదు. యజమాని కూడ కూలీలతో కలిసి పని చేయడం సహజం. పనికి పురమాయిస్తూపాడే ఈ కోతపాట చూడండి.

'కొయ్యండమ్మా కొయ్యండి
కోసీ వాదులూ వెయ్యండి
వానల బరువుకు వంగిన సేను
వెన్నులు నిండిన వన్నెల సేను
మెల్లిగ తీసీ మొదలు కోసీ
గింజలు బురదలో పడిపోకుండా
పొందుగ వెన్నులు కొయ్యండల్లా
కాలం సూత్తే వానాకాలం
కాలు సెయ్యూ కదిపితేనే
కుండలో కూడు కలిసొతాది—'

రాయలసీమ జిల్లాలలో ఈ పాట వ్యాప్తిలో వుంది

పొలిపాటలు

పండిన గింజలు దులుపుకొని, ధాన్యరాశులు పోసుకొని కళ్ళాంలో పాడేవి- పొలిపాటలు. వ్యవసాయానికి సంబంధించి చివరి ఘట్టమిది. వరి తాలు కొట్టి గింజల్ని రాశి బోశి చుట్టూ గిర్ర గీస్తారు' దాన్ని పొలి అంటారు. పొలి అనగా లాభం అని అర్థం. ధాన్యం తూర్పార పట్టేటప్పుడు 'పొలికలుగ పోలో పొలి' అంటారు. ఇలాటప్పుడు ఎక్కువ ధాన్యరాశి కావడానికి పూజించే దేవుణ్ని పొలిగాడంటారు. వేపాకు చేత పట్టుకొని ధాన్యం చుట్టూ తిరుగుతారు. దీన్నే పొలి తిరుగు అంటారు.

'ఒలియొ ఒలియొ ఒలియో ఒలియులే
గావేలు కలవాడా రార పోలిగాడా

రావేలు మీ కయ్యే, రాశి మీదయ్యా'- వంటివి పొలిపాటలు.

ఊడ్పుపాటలు

జానపదులకు గౌరమ్మ, ధాన్యలక్ష్మి. ధాన్యాన్ని ఇల్లు చేర్చేముందు ఆమెను మరువరు గౌరమ్మపై ఊడ్పుపాట పాడుతారు. ఇది మంగళం లాంటిది.

'అయిపోయె గౌరమ్మ అయిపోయెనమ్మ
ఆ పైన గిరిమీద ఆడి రావమ్మ
మా జొన్నలయిపోయె మేము పోతాము

మళ్ళొచ్చి నీ పాట లెల్ల పాడేము' — అని పాడుతూ ఇల్లు చేరుకుంటారు.

జానపదులకు పనిపాట్లపై గల శ్రద్ధ, ఉత్సాహం, శక్తి సామర్థ్యాలు వర్ణనాతీతం ఈ పొలం పనిపాటలు శ్రమను నివారించుకొనుటకు, నూతనోత్సాహంపుంజు

కొనుటకు పాడుకొన్నవి. ఇవి జానపదులచిత్తవృత్తిని ప్రతిబింజేంప చేస్తాయి. పొలం పాటలకు సంబంధించి పారపదం, గొడ్డలి పాట వంటివి కూడా కొన్నిచోట్ల కనిపిస్తాయి. జనపదుల నోళ్ళలో నిలిచి లెక్కకు మిక్కుటంగా వున్న గేయాలను మండలాల వారిగా సేకరించి, వర్గీకరించి, భద్రపరచుట, జిజ్ఞాసువులైన, విజ్ఞానుల కర్తవ్యం. ఇవి మన జాతి అమూల్య రత్నాలు.

రీసర్చి స్కాలర్,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి-517512

ఉపయుక్త గ్రంథసూచి :

1. 'త్రివేణి' (జానపద గేయ సంకలనం) : సంపాదకులు : ఆచార్య బి. రామరాజు.
2. పల్లె పదాలు : (జానపద గేయ సంకలనం) సంపాదకులు : కృష్ణశ్రీ'.
3. జానపద గేయ వ్యాసావళి : —నేదునూరి గంగాధరం.
4. తెలుగు కన్నడ జానపద గేయాలు — డా॥ ఆర్వీయస్. సుందరం.
5. తెలుగు జానపద గేయ సాహిత్యము : ఆచార్య బి. రామరాజు

1. నేదునూరి గంగాధరం— జానపద గేయ వ్యాసావళి. పుట. 3.
2. త్రివేణి . పుట. 15.
3. పల్లెపదాలు : పుట. 12.

# గ్రీకు దార్శనికుల ప్రజాస్వామ్యం

— ఆచార్య శ్రీపతినాయుడు

సర్వ శాస్త్రాలకు పుట్టినిల్లు గ్రీకుదేశం. అక్కడ పుట్టి పెరిగిన శాస్త్ర సారస్వతం దేశ విదేశాలకు వ్యాపించి, భావితరాలకు తరగని పెన్నిధిగా నిల్చి పోయింది. ప్రకృతి ఆటుపోటులకు తట్టుకొని అతి చిన్నదయిన గ్రీకుదేశం ప్రపంచానికి అనేక యుగాలకు సరిపడ విజ్ఞాన సర్వస్వాన్ని అందచేసింది. వేదాంత, సంస్కృతీ వైభవానికి గ్రీకుదేశం ప్రతీక. గ్రీకుదేశ చరిత్రలో అతి ప్రసిద్ధ మయిన పెలోపనీషియన్ యుద్ధం తరువాత గ్రీకు దేశపు ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థలలో గణనీయమైన మార్పు వచ్చింది. ఏథెన్సుకు, స్పార్టాకు మాత్రమే ఈ యుద్ధం పరిమితమైనా, వ్యవస్థల్లో మార్పు సంభవించింది. థ్యూసిడైడ్స్ మేధస్సు, పెరిక్లిస్ వాగ్ధాటి గ్రీకు దేశానికి వన్నె తెచ్చినాయి. నీలమేఘావృతమైన చిన్న గ్రీకు దేశం మీద క్రీ. పూ 421-417 మధ్య నల్లని మబ్బులు కమ్మినాయి. కాని ఈ మబ్బుల చాటు నుండి ప్రపంచానికే వెలుగును ప్రసాదించిన వారు ప్లేటో అరిస్టాటిల్. కాని చరిత్ర మరుగులో వీరిద్దరికి మూల పురుషుడు సోక్రటీస్. ఈ జ్ఞాన త్రయంతో గ్రీకు దేశం పుణ్య భూమిగా మారింది. చరిత్ర పుటల్లో గ్రీకు దేశం ధన్యం అయింది. గ్రీకు ప్రజాస్వామ్య వ్యవస్థకు మూల కారణం వారి నగర రాజ్యాలు. శ్రమ ప్రాతిపదికగా సమిష్టి సంకలనమే ఊపిరిగా ఈ నగర రాజ్యాలు ప్రజాస్వామ్య భావాలను సిద్ధాంతాలను తమ కడుపులో దాచుకున్నాయి. కాని విశాల దృక్పథానికి వ్యక్తి స్వేచ్ఛా జీవనానికి మారుపేరైన ప్రజాస్వామ్యంలో కూడా. వ్యక్తిగత వాదాలకు రూపం ఏర్పడింది ప్రజాభిప్రాయాన్ని ప్రతి బింబింప చేసే తిరుగుబాటు ప్రయత్నాలను ప్రజాస్వామ్య గ్రీకు ప్రభుత్వం భరించలేక పోవడం చరిత్ర చేసుకొన్న దురదృష్టం.

గ్రీకు దార్శనిక చరిత్ర, సోక్రటీస్ క్రీ. పూ. 469లో జన్మించడం లోనే మారిపోయింది. తండ్రి రాతిపని కార్మికుడు. తల్లి మంత్రసాని. అందువల్ల సోక్రటీస్ శిల్పకారునిగా జీవితం ప్రారంభించినాడు. కాని బాల్యం నుండి సత్యాన్వేష పరుడైన సోక్రటీస్ ప్రాపంచిక జీవనంలో విజయం సాధించ లేక పోయినాడు. ఇటుకలు, రాళ్ళు, కట్టెలు, దుంగలు, అపజయాలు, విషం లాంటివి ఇతన్ని కదిలించిన లేక పోయినాయి. సోక్రటీస్ శరీరం అంతా సత్యాన్వేషణ కణాలతో నిండిపోయింది. ఏథెన్సు నగర రాజ్యం అవలంభించి ప్రజాస్వామ్య విధానాలు ఈ తత్త్వ వేత్తకు రుచించలేదు. ఇది గొర్రెల ప్రభుత్వమని వీరి భావన. ప్రజాస్వామ్యంలో విమర్శకు స్థానం ఉన్నా ఏథెన్స్ ప్రభుత్వం సహించ లేక పోయింది. యువతను చెడు మార్గం పట్టిస్తున్న ఆరోపణపై కటకటాల వెనుక ఉన్న ఈ మహాజ్ఞాని మనస్సుకు సంకెళ్ళు వేయలేక పోయారు. నిజానికి న్యాయ ధవుల శిక్షను కోరే హక్కును సోక్రటీస్ ఇచ్చారు. శిక్ష విధించిన తరువాత పారి పోవడానికి కూడా అవకాశం ఇచ్చారు. మనస్సును స్వేచ్ఛగా వదలి వేసే

సోక్రటిస్, శారీరకంగా ఆ పని చేయలేదు. సంతోషంగా విష పానం చేశాడు.

తనను శిక్షించ దలచిన నావయాధీశులను ఉద్దేశించి ఎ శిక్ష విధించినా భయపడను; ఏ పద్ధతికి భయపడను. వెయ్యిసార్లు చావడానికి సిద్ధంగా ఉన్నానని ప్రకటించిన ధీరుడు. కాని సోక్రటిస్‌బోధనలు, ఆయన జీవిత కాలంలో గ్రంథీకరింపబడలేదు. ఆ బృహత్తర కార్య భారాన్ని చేపట్టిన వాడు ప్లేటో.

భౌతికంగా మరణించిన సోక్రటిస్, ప్లేటో శరీరంతో నివసించినాడు సంస్కారం, సంపద పుష్కలంగా ఉంది అందం ఆకర్షణ కల్గిన ప్లేటో, సోక్రటిస్ బోధన పట్ల ఆకర్షితుడు కావడం గ్రీకు చరిత్రలో మరోమలుపు. నిరంతర అధ్యయనానికి ఒక అకాడమీ ప్రారంభించి, జీవితమంతా ఆశ్రేయులకు కష్టబడిన వాడు ప్లేటో. ఈ తత్త్వవేత్త గొప్ప రచయిత. కాబట్టి తన భావాలను, సిద్ధాంతాలను అక్షర రూపంలో భద్రపరచి మనకు అందించ గలిగినాడు. రిపబ్లిక్, స్టేట్స్‌మన్, లాస్ అనే గ్రంధాలు ప్లేటో అందించిన రాజకీయ భావాల గనులు. రోగిని పరీక్షించే వైద్యుని వలె. ఏథెన్స్ ప్రజాస్వామ్యాన్ని సమూలం విమర్శించ గలిగినాడు. తన పరిశీలనలో గ్రీకు ప్రభుత్వం మూడు రోగాలతో పీడింప బడుతూ ఉందని గ్రహించినాడు. ఒకటి రాజకీయ పరిజ్ఞానం లేని ప్రజల పాత్ర, రెండు రాజకీయ విభేదాలు,మూడు ప్రజాభిప్రాయాన్ని మన్నించని ప్రభుత్వం. రాజకీయ క్రియాశీల చర్యల్లో పాల్గొనే ప్రత్యేక వర్గం ఉండాలని ఇతని వాదన. వీరిని వృత్తి ప్రత్యేక వర్గంగా భావిస్తాడు ప్లేటో. సామాజిక పరివర్తన, సంఘంలోని సంఘర్షణ ఈ విభజన వల్ల ఏర్పడుతుంది. వేదం కాలం నాటి [illegible]ర్యుల వర్ణాశ్రమ ధర్మానికి, ప్లేటో సామాజిక ప్రజా విభజనకు దగ్గర పోలికలున్నాయి. వేద విద్య, జ్ఞాన సముపార్జన ధ్యేయంగా జీవించిన బ్రాహ్మణులను ప్లేటో సూచించిన వేదాంతులకు పోల్చవచ్చు ధర్మరక్షకులు, దుష్ట శిక్షకులు అయిన క్షత్రియులను ప్లేటో ఆక్సలరీ తరగతిగా భావించినాడు. వ్యాపారం జీవన విధానంగా అవలంబించిన వైశ్యుల వలె, ప్లేటో సమాజంలో కోర్స్గలవర్గం ఉంది. రాజకీయ వెలివేతలుగా భావించబడ్డ బానిసలను శూద్రులతో పోల్చవచ్చు. కానిప్లేటో విభజనలో మార్పిడికి అవకాశం ఇవ్వబడింది. ఒక తరగతి నుండి మరో తరగతికి, వృత్తిదృష్ట్యా వర్గమార్పిడి అనుమతించబడింది. 20 ఆర్యసమాజంలో లేదు. ప్లేటో ప్రతిపాదించిన ప్రజాస్వామ్య సిద్ధాంతంలో కేంద్రం న్యాయం గురించి ఇచ్చిన వివరణ. రిపబ్లిక్ అనే గ్రంథంలో ఈ భావానికి రూపకల్పన చేయబడింది. ప్రతివ్యక్తి యిచ్చిపెచ్చుకునే రీతిలో సమాజంలో మెలగాలని ఇతని భావన. ప్రభుత్వం నుండి సౌకర్యాలు కోరే ముందు, ప్రభుత్వంకోసం వ్యక్తి చేయవలసిన కృషిని గురించి ఆలోచించాలి నీతి, నిజాయితీకూడిన పౌరుల ప్రవర్తన ప్రజలకు కావాలి. నిత్యజీవన అవసరాలను ప్రభుత్వం తీర్చాలి. అటువంటి రాజ్యమే ఉత్తమ రాజ్యమని రిపబ్లిక్ అని పిలువబడుతుంది. నేరాన్ని అరికట్టేందుకు, నేరస్థునిలో మార్పు తెచ్చేందుకు న్యాయవ్యవస్థకృషి చేయాలి. రిపబ్లిక్ అనే పదాన్ని గురుదేశం అనాడే ప్లేటోద్వారా మనకు అందింది. ఆచరణ యోగ్యంకాదనుకున్న ఈభవం. ఈనాడు ప్రపంచమంతా వ్యాపించింది.

## అరిస్టాటిల్

రాజనీతిశాస్త్ర పితగా పరిగణించ బడినవాడు అరిస్టాటిల్. బాల్యంనుండి రాజనీతి భావాలతో సతమతమై జీవితమంతా వాటి అధ్యయనానికి ధారపోసిన ఈ దార్శకుని జీవితంలో విషాదమట్టం జరిగింది. ఆర్థిక శాస్త్రం, తర్కం, ఖగోళశాస్త్రం, నీతిశాస్త్రం, భౌతిక

వైద్య శాస్త్రాలనేకం అభ్యసించినప్పటికి, ప్లాటోను గురువుగాభావించి నప్పటికి ప్లాటో అకాడమీ అధ్యక్ష పదవికి స్పేసిప్పస్‌కు దక్కింది. ఎంతో దిగులుపడి పోయినాడు. అకాడమీ పదలివేసి, అటార్నీయన్ రాజు హెర్మియస్ ఆశ్రయం పొందినాడు. క్రీ. పూ. 342లో ఒక విప్లవం జరిగి, హెర్మియస్ పదవీ భ్రష్టుడైనాడు. మాసిడోనియారాజు ఫిలిప్ అరిస్టాటిల్‌ను తన ఆస్థానానికి ఆహ్వానించాడు. జగద్విఖ్యాత వీరుడు అలెగ్జాండర్‌కు గురువు కాగలిగినాడు. మాసిడోనియాన్ల కుట్రలఫలితంగా అరిస్టాటిల్ ప్రాణాలు కోల్పోవలసి వచ్చింది. పాలిటిక్స్, ఎథిక్స్ అనే రెండు గ్రంథాలు ప్రామాణికంగా నిల్చిపోయాయి.

అసాధారణ విషయాల అధ్యయనంతో ప్రారంభించి, సాధారణ సూత్రాలను సాధించినవాడు అరిస్టాటిల్. ఊహామాత్రంగా ఏవిషయం వ్రాయలేదు. చరిత్ర ఎక్కడ ఓటమి అంగీకరించిందో, అక్కడ నుండి తన అభ్యాసం ప్రారంభించినాడు. ఎక్కువ మంది ప్రజలకు మేలుచేసే ప్రభుత్వమే ప్రజాస్వామ్యమని ఇతని భావన. నిజానికి సంతోషజీవనం ప్రజలు గడిపేటట్లు చూడాలని ప్రతిరాజ్యం పనిచేయాలని ఇతని శాసనం. అందువల్ల రాజ్యాలలోని రకాలను వివరించినాడు. అన్నింటిలోకెల్లా ఉత్తమమైన ప్రభుత్వం ఏదని తర్కించినాడు. పాలిటీ అనేపేరుతో ఉత్తమ ప్రభుత్వ లక్షణాలను వివరించినాడు. ఇది ప్లాటో రిపబ్లిక్ కంటె ఉత్తమమైన ప్రభుత్వం. ప్రభుత్వపాలనా వ్యవస్థలో స్త్రీలకు హక్కులు ఉండరాదని భావించినాడు. అదేవిధంగా బానిసవ్యవస్థను అంగీకరించినాడు. ప్రభుత్వాలను కూలద్రోయడానికి విప్లవాలు ఎందుకుజరుగుతాయో కారణాలు చర్చించి, ఫలితాలను వివరించినాడు. గ్రీకుదార్శనికులు ఊహామాత్రంగా భావిప్రజాస్వామ్య విధానం గురించి స్పష్టంగా వ్రాయగలిగారు. రాజనీతిశాస్త్ర, అధ్యయనం వీరి రచనలతోనే ప్రారంభం అవుతుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వంలోని గుణదోషాలను కూలంకషంగా బేరజువేసి, వ్యతిరేకతను ఎదుర్కొని తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా వెల్లడి చేసినారు. గ్రీకు దార్శనికుల ప్రజాస్వామ్య భావాలు, రాజనీతిశాస్త్రజ్ఞులు పరిశీలింపతగ్గది.

చరిత్ర పురావస్తు శాస్త్ర శాఖాధ్యక్షులు.
బెసెంట్ దివ్యజ్ఞాన కళాశాల
మదనపల్లె-518 327

# పరమయోగి విలాసము-తిరువేంగళనాథుడు

— మొవ్వ వృషాద్రిపతి

ప్రపంచమున ఏ సాహిత్యమైనను, మతసంపర్కమున, అత్యంతాభివృద్ధిని సాధించును మత ప్రచారమునకు, సాహిత్యమునొక తిరుగులేని సాధనముగా తొలుతటి నుండియు వాడుకొనుచునే యున్నారు. ఆంధ్ర సాహిత్యము వైదికమతోద్ధరణోత్సాహముతో ప్రారంభమైనది. శ్రీ మహాభారతము, వైదిక మత ధర్మ ప్రతిపాదకము. అనాడు ప్రజాబాహుళ్యమున ప్రబల వ్యాప్తియందున్న బౌద్ధజైనమతముల ప్రాచుర్యమును క్రిందు పఱుచుటకు వైదికసంప్రదాయ సాహిత్యము విరివిగా విరచింపబడుట అనివార్యమైనది. అనాడు తెలుగు వాఙ్మయమున, సంస్కృతపద జటిలములై-సమాస భూయిష్ఠములైన గద్యపద్యాత్మక చంపూకావ్యములే రాజాస్థాన గౌరవాదర పాత్రములైనవి.

తమ మతవ్యాప్తికై సాహిత్యమును ప్రధాన సాధనముగా నెన్నుకొన్నవారు తొలుత వీరశైవులు, ఆంధ్ర వాఙ్మయమున వీరశైవసాహిత్యము విరివిగా విరచింపబడుటయేకాక, సముచితస్థానము నలంకరింపగలిగినది. వీరశైవ కవులలో ప్రాతఃస్మరణీయుడు, మహాపండితుడు, అనేకగ్రంథకర్త పాల్కురికి సోమనాథుడు. మతము పేరిటనేయైనను, ఆంధ్రసాహిత్యమున కితడు కావించినసేవ అనితరసాధ్యము. చిరస్మరణీయము అతని కాలమునాటికి సమాజమున కావ్యగౌరవమునందిన రచనలు బహుస్వల్పము. అట్టి గౌరవపాత్రములైన రచనలలో అగ్రేసరము నన్నయ భారతానువాదము. కాని, అది సామాన్యజనుల కందుబాటులో లేని సుధాజలధి. దాని నాస్వాదింపగల వారి సంఖ్య చాలతక్కువ. ఇట్టిదశలో సోమన గంటము పట్టినది మతవ్యాప్తికి. ప్రజాబాహుళ్యము కొరకు. మతము సామాన్య మానవులలో చొచ్చుకొని పోవలయునని. దాని సిద్ధాంతము లందఱకు నందుబాటులో నుండవలెను. అట్లని, ఆరోజులలో కేవలము-వచనరచన కొనసాగించినచో విద్యావంతులు నిరసింతురు. వచనమున కపుడు కావ్యగౌరవము లేదు సరికదా-దాని కస్తిత్వమేలేదు. ఛందోబద్ధముకానిది కవిత్వమేకాదను దృఢాభిప్రాయము ప్రజాహృదయములలో గాటముగా నాటుకొన్న కాలమది. లక్షణకర్తలలో నాద్యుడగు భరతుడు "ఛందోహీనో నశబ్దోస్తి నచ్ఛందశ్శబ్ద వర్జితమ్" అను సూత్రముచే, ఛందశ్శబ్దముల కవినాభావ సంబంధము నిరూపించెను. కావున, సోమన సంస్కృతపదసమాస జటిలమైన వృత్తరచనములను నిరాదరించి, స్వచ్ఛదేశీయచ్ఛందమగు ద్విపదపై దృష్టిసారించెను కవితా కన్యకు, ద్విపద పదవిన్యాసముతో వివిధ నాట్యభంగిమలునేర్పి, క్రొంగ్రొత్త పోకడలతో తెలుగు వాఙ్మయ రంగమున చిందులు త్రొక్కించిన ప్రథమాచార్యుడు సోమనాథుడు. అత్యంతతీవ్ర భావప్రకటనమున నాతడు వ్యాకరణాదులను సెతము లెక్కించిన వాడు కాడు.

ఆ తదుపరి ద్విపదలను మతగ్రంథ రచనమునకు వాడుకొనుటయే కాక, దానిని రాజాస్థానగౌరవభాజన మొనర్చిన ప్రఖ్యాతి వైష్ణవ కవులకు లభించినది.

అందునను తాళ్ళపాకవారి కుటుంబమునకు ద్విపద కవితలు ఋణపడియున్నవి. వారు మున్మతః స్మార్తులైనను, వైష్ణవమును స్వీకరించి, తన్మత వ్యాప్తికై శక్తిసామర్థ్యములు సర్వస్వమును వెచ్చించిన పరమ భక్తశిఖామణులు.

అనాడు మహాకవులకు-కవిపోషకులైన మహారాజులకు ద్విపదకావ్యములపై తిరస్కారభావము మెండు. శ్రీనాథునిదిగా ఆంధ్రదేశమున ప్రశస్తిగాంచిన

"ముదివిటులు-విధవలంజలు
పదకవితలు-మారుబాసబాపనవర్శ్యల్" అను చాటు పద్యమును గమనించినచో పైవిషయము తెల్లముకాగలదు. ఆపుడు శతకవాఙ్మయ మన్నను, శతక కవులన్నను ఆదరాభిమానములు లేవు. తాను రచించిన గ్రంథముల పట్టికను తెలుపునపుడు మహాకవులు స్వీయ విరచిత శతకములను గురించి చెప్పకొనలేదు. అట్టి కేవలశతక కవులకు గూడ ద్విపదపై చాల చిన్న చూపుకలదు. వేణుగోపాల శతకములోని

"ద్విపదకావ్యంబు ముదిలంజదిడ్డిగంత" అను పాదము బట్టి ఈ విషయము నిర్ధరింపనగును.

ఐనను ద్విపదల నాదరించి, విరివిగా ద్విపదకావ్యములు రచించిన వారు తాళ్లపాక కవులు. వారిలో ప్రథముడన్నమయ్య. ఈయన పదకవితా ధురీణుడు. ఈయన కుమారుడు పెద తిరుమలాచార్యులు. ఆయన కూడ అనేక గ్రంథములను రచించెను. ఆయన కుమారుడే తిరువెంగళనాథుడు ఈయనకే 'చిన్నప్ప'యను ప్రఖ్యాతనామముకలదు. ఈమహాకవి "అష్టమహిషీ కల్యాణము పరమయోగి విలాసము-అన్నమాచార్య చరిత్రమునను మూడు రసబంధుర ద్విపద కావ్యములనురచించి, ఆంధ్రవాగ్దేవి నర్చించి, మహారాజుల గౌరవాదరములకు పాత్రుడయ్యె.

"అనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ"

అని పరమయోగి విలాసమున తననుగూర్చి చెప్పుకొనెను. ఆవేంకటాద్రీశుడు, కలియుగదైవమగు వేంకటాద్రీశుడే కావచ్చును. లేదా అట్టి పేరుగల ప్రభువెవ్వరో చారిత్రకముగ చర్చింపవలసియున్నది. చిన్నన్నగాని-తత్పితా మహుడన్నయ్యగాని పద్యప్రబంధములు కూర్చినవారుకారు. రాజసన్మాన గృహీతులగుటకు వారి ద్విపదకావ్యరచనా ధౌరంధర్యమే హేతువు. చిన్నన్న ప్రశస్తికి దర్పణముగా

"చిన్నన్న ద్విపదకెఱుఁగును
పన్నగఁబెదతిరుమలయ్య పదముల కెఱుఁగున్"

అనుపద్యము తెనాలిరామకృష్ణునిదిగా ఆంధ్రజనతా రసనాగ్రముల నాట్యమాడుచున్నది. ప్రౌఢోదాత్త గంభీర రసవత్ప్రబంధ రచనకు పద్యమునకుగల సామర్థ్యము ద్విపదకును కలదని ఉదాహరణ పూర్వకముగా ఋజువొనర్చినవాడు చిన్నన్న. ద్విపదకావ్యములకు తెలుగు సాహిత్యరంగమున, నిద్దరే, నిజమగు ప్రాతినిధ్యమును వహించుచున్నారు. వీరశైవ కావ్యరచనా విశారదుడు సోమనాథుడు, వైష్ణవకావ్యనిర్మాణ ధురీణుడు తిరువెంగళనాథుడు.

అష్టమహిషీకల్యాణమున ద్విపద రచన మెట్టుండవలయునో లక్షణమును నిర్దేశించి తన్నియమానుసారముగా కావ్యరచనలను నిర్వహించెను. 16వ శతాబ్దమున ద్విపదకావ్యములను రచించిన యితరకవులకూ, నీయన వైచినమార్గమే యొరవడియైనది. సోమయాజికి కందము చందమున, శ్రీనాథునకు సీసము విధమున, వేమన కాటవెలదివలె చిన్నన్నకు ద్విపదవశమైనది. గంగాప్రవాహ సదృశకవితా మాధ్వీకధార, హిమాలయ శృంగోన్నత భావవైశారద్యము వనధిగంభీర యోజనాపటిమ, త్రోత్రోపులాడికొనుచుండగా, చిన్నన్న ద్విపదలు, మత్తద్విపములవలె గమించును. కావుననే "చిన్నన్న ద్విపదతిఱుగును," అని కాక "చిన్నన్న కెఱుగుద్విపదలు" అని చెప్పనొప్పును. ఎంతటి సున్నితము-సూక్ష్మమునైన భావమును సైతము సునాయాస

ముగా వ్యక్తీకరింపగల నేర్పు చిన్నన్న కూర్పులోని ప్రత్యేకత. అవసరమైనచోట అతిదీర్ఘప్రౌఢసంస్కృత సమాసములను ప్రయోగించును. అదే వరుసలో అలతి-అలతి-తేటతెనుగు మాటలతో పాఠకుల హృదయములను మైమఱపింపజేయును

శివభక్తులలో "నయనార్లు" వలె విష్ణుభక్తులలో "ఆళ్వారులు" సుప్రసిద్ధులు. వారు పన్నిద్దరు. వారందఱును ద్రావిడభాషలో మనోహర భావనా విలసిత భక్తిప్రబంధములు వెలయించి, భక్తిస్రవంతిని అఖండభారత వ్యాప్తమొనర్చినారు. ఆళ్వారులనగా భక్తిప్రవాహ నిమగ్నులని యర్థము. అనగా భక్తి యొక్క లోతులు గమనించినవారు. భగవంతుని యందు భక్తునకు కలుగు పరమానురక్తియే భక్తి. భక్తి తొమ్మిది విధములుగా భాగవతము వర్గీకరించినది. ఈ నవవిధభక్తులను, తమతమ పాశురములందు ఆళ్వారులు తన్మయీ భూతులై గానమొనరించిరి. అంతియేకాక, వారి జీవితవర్తనములే నవవిధభక్తులకు తార్కాణములు. వీరిలో నమ్మాళ్వారు ప్రముఖులు. వైష్ణవమున, నీ యాళ్వారులేకాక, యామునులు-రామానుజులు-నాథమునులు మొదలగు నాచార్యపురుషులు కలరు. కొందరు మధురకవియాళ్వారులను పన్నిద్దరాళ్వారులలో చేర్చిరి. మరికొందఱు, మధురకవినివిడిచి. "ఇళయాళ్వారు" అను పేరుతో రామానుజులను పన్నిద్దరాళ్వారులలో చేర్చిరి. ఈ యాళ్వారులందరును దైవాంశసంభూతులే. విష్వక్సేన-గరుడ అనంత-శంఖ-చక్ర-నందక - కౌమోదకీ - శార్ఙ్గాంశ సంజనితులే ఆళ్వారులు.

ఈ ఆళ్వారులలో నొక్కరుండగు పెరియాళ్వారు (విష్ణుచిత్తులు)ల చరితము నాధారముగా గ్రహించి, సాహితీసమరాంగణ సార్వభౌముడు విష్ణుచిత్తీయము లేక ఆముక్తమాల్యదయను విద్వత్ప్రబంధమును విరచించెను. ఇందు గోదాదేవి చరిత్ర విపులముగా వర్ణితము. ఆచార్యపురుషుడగు యామునాచార్య చరిత్రము ఆళ్వారుల చరిత్రముతోపాటు ఇందు జోడింపబడినది.

అంతకుతప్ప ఆళ్వారుల ధార్మిక జీవితగాథా విన్యస్తములగు కావ్యములు తెలుగునాట నాటికుద్భవింపలేదు. ఆ కొఱత తీర్చుటకో యనునట్లు తిరువెంగళనాథుడు ఏదేని కావ్యమొనరింప వలయునని తలపోయుచుండగా.

"కలలోన వైష్ణవాకారంబుఁ దాల్చి
యేతెంచి శ్రీవేంకటేశుండు తనదు
చేతఁ దానారగించిన ప్రసాదంబుఁ
గృపసేసి పరమయోగి విలాసమనఁగ
నిపుడు కాసార యోగీంద్రాది కథలు
జానుఁగా సిరికిని సపరివారుండ
నైనట్టి తనకు నీ వంకితంబుగను
బనుపడ ద్రవిడ ప్రబంధంబుచూచి
తెనుఁగున రచియింపు ద్విపద రూపమున"

అని యాజ్ఞాపించెను. కావ్యేతి వృత్తమును, తచ్ఛందమును, గ్రంథనామమును కృతిభర్తను-శ్రీ వేంకటేశ్వర స్వామియే ఆనతిచ్చెను.

సంస్కృతమున ప్రపన్నామృత మనుప్రాచీన దివ్య ప్రబంధము కలదు. ఆళ్వారుల చరితారత్నములను వరుసగా గుచ్చిన మణిదామ మది. అందలి ఆళ్వారుల గాథలకును, పరమయోగి విలాసగాథలకును, చాల భేదము కన్పించుచున్నది. తిరువెంగళనాథుడు తాను ద్రవిడ ప్రబంధము ననుసరించి వ్రాసితినని కావ్యాదియందే తెలుపుకొనియెను. మరి ప్రపన్నామృతమున కాధార మెయ్యదియో విచారింపవలసియున్నది.

తిరువెంగళ నాథుడు కావ్యాదియందును, ప్రత్యాశ్వాసాంతమందును తాత తండ్రులను స్తుతించుచు వచ్చినాడు. కావ్యాదియందు

"ఘనతర పంచమాగమ సార్వభౌము
ననఘు శ్రీతాళ్లపాకాన్నమా చార్యుఁ

దలఁచి యంజలిచేసి తత్ప్రసాదంబు
కలిమిని పంచమాగమ సార్వభౌము
హరిసేవ రాశ్వలాయన సూత్రనంద
వరవంశభవ భరద్వాజ సగోత్ర
పావన శ్రీ తాళ్ళపాకాన్న యార్య
ధీ విశారద సూనుఁ దిరుమలాచార్య
వినుత నందన తిరువేంగళ నాథుఁ
డను పేరిట యేను................"

అని తనను పరిచయ మొనరించుకొనెను. ఇందు పితామహుడగు నన్నమయ్యకు "పంచమాగమ సార్వభౌముడు, అనఘుడు-పావనుడు-ధీవిశారదుడు-అను విశేషము-లు వాడబడినవి. పంచమాగమ సార్వభౌము డనునది ప్రత్యేకముగా రెండు పర్యాయములు వాడబడుట గమనింపదగినది. వైష్ణవమున" పాంచరాత్రాగమమును "పాటించువారు" పాంచరాత్రులు ఆ సిద్ధాంతమును కూలంకషముగా నెఱింగిన వాడగుటచే నీ విశేషణము సాభిప్రాయకమని తలంతును.

ప్రత్యాశ్వాసాంతమునందును
"......శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకన్న యార్య
తనయ తిమ్మార్యనందన......"

అని తనపేరును తాతతండ్రుల పేర్లతో బిగించుకొనియెను.

ఈతడు అన్నమాచార్య చరిత్రమను ద్విపదగ్రంథమును విరచించినట్లు ఆంతరంగిక విషయములే సాక్ష్యమునొసంగుచున్నవి.

పరమయోగి విలాసమున

"శ్రీకర వైష్ణవ సిద్ధాంత విభవ
పాకశాసను దాళ్ళపాకశాసనుని
యాచార విజితామరాచార్యుఁదిరుమ
లాచార్యమను మదీయాచార్యుఁదలఁచి"

అని గురునమస్కార మొనరించెను. అన్నమాచార్య చరిత్రమున

"పరమోపకృతిఁ దాళ్ళపాకాన్న యార్య
నాచార్య విజితామరాచార్యుఁదిరుమ
లాచార్య మను మదీయాచార్యుఁ గొలిచి
జలజాతవాసిని చనుబాల పుష్టిఁ
బలికెద నానేర్పు పరిపాటి నిపుడు"

అని గురుస్తుతి కావించెను. చివరిరెండు వాక్యములలో కవియొక్క వినయసంపత్తి మూర్తీభవించి యున్నది.

"నా, నేర్చిన భంగిఁదెల్ప వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్" అని శ్రీమదాంధ్ర మహాభారతమున చాటించిన తిక్కనసోమయాజి వాక్యము నందేభావము కలదో, శ్రీమదాంధ్రభాగవతమున "విబుధ జనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేట పఱతు" అని సాయించిన సహజ పాండిత్యుని వాక్కులయందే వినయసంపద వ్యక్తమగుచున్నదో, అదే భావము "పలికెద నా నేర్పు పరిపాటినిపుడు" అను చిన్నన్న వాక్యము ధ్వనించుచు, నాతని వినయశీలతను వ్యక్తీకరించుచున్నది. ఆ పలుకుటయు తన శక్తిచేతకాదు. జలజాతవాసినియగు అలర్మేల్మంగ చనుబాలపుష్టి చేతనట. "పలికించెడి వాడు రామభద్రుం"డని పోతనగారు చెప్పినట్లు, ఇచ్చట కర్తృత్వము లక్ష్మీదేవికే చెందుచున్నది.

పరమయోగి విలాసమును — అన్నమాచార్య జీవిత చరిత్రమును

"శ్రీయలమేల్మంగ జిరకృపాపాంగ" అను పాదముతోడనే ప్రారంభింపడుట గమనార్హము.

తిరువేంగళనాథుడు సంస్కృతాంధ్ర ప్రాచీన గ్రంథములతో పాటు అన్నమాచార్యుల పదములను పలుమార్లు పఠించి జీర్ణించుకొనియెను. అన్నమాచార్యుల ఎత్తుగడలు- పదబంధములు- వర్ణనములు

పరమయోగి విలాసమున ప్రత్యక్షమగుటయే దానికి దానికి తార్కాణము. శ్రీ వేంకటేశ్వరస్వామిని 'ఈ తాత-మనుమళ్ళ' వలే తనివిదీర వర్ణించిన కవులితరులు లేరు. అన్నమాచార్యుల బాల్యమున శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమయ్యెను. పరవశించిన అన్నమయ్య ఆ దర్శనమును,

'ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పఁడగు తిరు వేంకటాద్రీశుఁ గంటి
అతిశయంబైన శేషాద్రి శిఖరముఁ గంటిఁ
బ్రతిలేని గోపుర ప్రభలుగంటి'

నిత్యాదిగా విపులముగా కీర్తించెను తిరువేంగళ పరమయోగి విలాసమున,

'సిరిఁగంటిఁ జెన్ను మించిన మేనుగంటిఁ
గరమొప్పు వదన వికాసంబుఁ గంటి
సల్లలితావనీ స్తన కుంభ కుంభ
వల్లవంబులఁ బోలు పాదముల్ గంటి'
నిత్యాదిగా వర్ణించెను'

అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర శతకమును, మృదుమధురములగు జానుతెలుగు పదములతో విరచించెను. అందు శ్రీ'అలమేలుమంగ' పేరును తొంబది యేడు పద్యములలో చొప్పించెను. చివరి పద్యమున-

'అమ్మకుఁ దాళ్ళపాక ఘనుఁ
　డన్నఁడు పద్య శతంబుఁ జెప్పె'

నని అలమేలుమంగ కంకితము గావించెను. వైష్ణవమున లక్ష్మికి గల ప్రాధాన్యము శ్రీపతి కన్న మిన్నయైనది. తాతగారి యడుగుజాడలలో పయనించిన చిన్నన్న పరమయోగి విలాసమును-

'శ్రీయలమేల్మంగఁ జిరకృపాపాంగఁ
దోయజ దళనేత్రిఁ దోయధిపుత్రి
శ్రీ వేంకటేశ సంశ్రితకుచదేశ
దేవేంద్ర వినుత నాదిమ వచో వినుత
గజరాజ మిళిత అంగరాజ కలిత
విజితాలి కులవేణి వికచాబ్జపాణి
జలజ లీలాగేహ సౌవర్ణదేహ
జలజాతభవమాత-జగదేక మాత...

అను స్తుతితో ప్రారంభించెను. ప్రత్యాశ్వాసమును అలమేల్మంగా స్తుతి తోడనే ప్రారంభించుచు. శ్రీ వేంకటేశ్వరున కంకితమైన కావ్యము అలమేల్మంగా స్తుతితో నారంభించుటచూడ, తాళ్ళపాకవారి ముదురు వైష్ణవము గోచరించుచున్నది. రెండవ పాదమున 'తోయజ దళనేత్రి' అని ప్రయోగించెను. వ్యాకరణానుసారము 'నేత్ర' యని యుండవలయును. 'మీన నేత్రి ఇత్యాదుల సాధువు' లని బాలవ్యాకరణ నియమము. ఈ యొక్కచోట తప్ప మిగిలిన కావ్యమునం దెల్లెడ 'జలజాత నేత్ర- తోయజనేత్ర' అను సాధురూపములను వాడిన కవి యిచ్చట మాత్రము 'తోయజదళ నేత్రి' అని ప్రయోగించుట ప్రమాదవశమున కాదు. ఈ కవి నిరంకుశ స్వభావుడు. 'తోయధి పుత్రి' అని తదుపరి ప్రయోగింపబోవుచున్నాడు. దాని కను ప్రాసకై 'తోయజ దళనేత్రి' యని బుద్ధిపూర్వకముగా ప్రయోగించెననుట నిర్వివాదము. కవికి గల స్వాతంత్ర ప్రవృత్తి- నిరంకుశత్వము దీనిచే గోచరించుచున్నది.

వైష్ణవులకు మోక్షము పరమ లక్ష్యము. పోతనామాత్యుడు 'శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక రక్షైకారంభకు' నని భాగవతమును ప్రారంభించెను ఈ కవి పరమపద వర్ణనము తోడనే పరమయోగి విలాసమును ప్రారంభించెను. దీనింబట్టి యీయన మోక్షాపేక్షతో నీ కావ్యమును రచించెనని యూహింపవచ్చును. ఇందు పరమపద వర్ణనము విస్తృతముగ చేయబడినది.

పరమయోగి విలాసము కథా ప్రధానమగు దివ్య ప్రబంధమైనను, వర్ణనా బాహుళమై- అలంకార తరళమై విరాజిల్లుచున్నది. ఈ కవికి సాహిత్యము నందే

కాక యోగము- సంగీతము మొదలగు ననేక విద్యల యందు పరిపూర్ణ పరిచయ మున్నది. ఏ విషయమును వర్ణింపవలసి వచ్చినను, ఆమూలాగ్రముగా వర్ణింపనిదే యీ కవి తృప్తి చెందడు. ఆనాటి ఆచారములు- పలుకుబళ్ళు- వేషభాషలు కన్నులకు గట్టినట్లిందు గోచరించును.

కవిత్వ మిట్లుండవలయునని, తిరువెంగళ నాధునకు నిశ్చితాభిప్రాయము లున్నవి. పరమయోగి విలాసమున-

‘పలికిన పలుకెల్లఁ బన్నీరు చెంబు
గులికిన చందానఁ గ్రొన్నెలసోఁగ
వొలసిన రీతిఁ గర్పూరంబు లప్ప
లొలుకుఁ గైవడి మించు లుడుగక మెఱయు
ననువునఁ జల్లఁగా నమృతంపు సోన
చినుకు సోయగమున జీవరత్నములు
మెలఁగెడు జాడఁ బ్రామినుకు వజ్రములు
తులఁగింప జలజలఁ దూర్పెత్తినట్టి
మెలపున వలపుఁ దెమ్మెరలు వేడించు
నలువునఁ గ్రొత్త కట్టాణి ముత్యములు
డాలించు సరణి బిటారంబు లొకటఁ
గీలించు కరణిఁ జక్కొలలుప్పతిలఁగ’

కవిత్వ ముండవలయునని వ్యంగ్యస్ఫూర్తితో వివరించెను. పై లక్షణము లన్నియు నాతని కావ్యములలో చోటు చేసికొనినవి. తన కవితా కళతో నిహపరములు రెండింటిని సమముగా నార్జించిన ఈ కవి తల్లజుడు ధన్యుడు. ఆ మహనీయుడు వెలయించిన భక్తి కవితామృత ధారలతో తానమాడి తడిసిన ఆంధ్రులే ధన్యులు.

ఆంధ్రోపన్యాసకులు,
టి. ఆర్. ఆర్. కళాశాల,
కందుకూరు, ప్రకాశం జిల్లా.

# సాహిత్యగోష్ఠి

## భావకవితా స్వరూపం

ఆధునికంగా వచ్చిన కవితా ఉద్యమాల్లో భావకవిత్వం మొదటిది. ఇది ప్రబంధ కవిత పై తిరుగుబాటుగా వచ్చిందని చెప్పవచ్చు. ఎట్లా అంటే—

"క్షీణ ప్రబంధ యుగమున వెఱ్ఱితలలు వేసిన రీతి ప్రాధాన్యమునకు, శబ్దచిత్ర లౌల్యమునకు, నిర్వేల శృంగారమునకు, నీరస సంప్రదాయ పాలనమునకు విరుగుడుగా, రసగుళికల వంటి రమ్య కావ్యములను సృష్టించిన కవి, రాయప్రోలు సుబ్బారావు గారు"

"......స్థూల దృష్టితో చూచినచో ఈనవ్య కవిత్వములో ప్రాతోత్తాలమైన ఉద్యమములు రెండే రెండు. ఒకటి భావకవిత్వము; రెండవది అభ్యుదయ కవిత్వము"2

ప్రబంధ కవిత్వంలో వస్తువర్ణన వుండగా, భావకవిత్వంలో అనుభూతి వ్యక్తీకరణ వుంది. ప్రబంధ కవిత్వం స్త్రీని శరీర పరంగా వర్ణిస్తే, భావకవిత స్త్రీ హృదయాన్ని వర్ణించింది ప్రబంధాలలో పురుషునిది ఆధిపత్యం అందులో శృంగారంభోగావధి కలది. అది వర్ణనా బాహుళ్యం, అలంకార భూయిష్టమైనదైతే, యిది వర్ణనాల్పమయ్యి, స్వల్పమైన నూతనాలంకార కారిణిఐనది. వస్తువర్ణనవల్ల ప్రబంధం కావ్యరూపం తాల్చితే, అనుభూతి కావ్యవస్తువు కావడంవల్ల భావకవిత ఖండ కావ్యరూపం తాల్చింది. సంఘటన దీనికి ఆధారం, ప్రబంధ కవితలో కథ అంతో యింతో వుంది, కాని, భావకవితలో కథ అసలే లేదు. తృణకంకణం, కడపటి వీడ్కోలు వంటి కావ్యాల్లో తప్ప.

1910 వ సంవత్సరంలో ప్రారంభమయిన భావకవిత్వం 1940 వ సంవత్సరం వరకు తెలుగు కవితారంగం పై నిలిచి పెద్ద మార్పును తెచ్చింది. ఈ తరహా కవుల్లో రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, దువ్వూరి,బసవరాజు, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాయని పింగళి, కాటూరి, తల్లావఝ్ఝల, బాపిరాజు మున్నగు వారు కలరు.

కవిత్వం ఉద్యమంగా ఉద్భవించవలసిన అవసరాన్ని గురించి చెపుతూ, ఎ. విశ్వం గారు, ఏ కాలము వారప్పటికి ముందు కవితా మార్గములనే శిరోధార్యములని, కొత్తబాటలు వేయజాల నప్పుడు సంప్రదాయ స్థితి పరిమిత మగును ఇట్టి పరిమితి కాలగమనమున ప్రాతగా పరిగణింపబడును ప్రాతతో, సర్వకాలము తృప్తి నందుట చైతన్యమునకు వ్యతిరేకధర్మము. క్రొత్తను సృష్టించుట చైతన్య గుణము క్రొత్తను సృష్టించ వలయునను నిచ్ఛయే. సంప్రదాయ నిరాసనమునకు కారణము. కాల్పనికోద్యమము నందు కూడ, ఇట్టి జిజ్ఞాస కన్పించును. కేవలం జిజ్ఞాస చాలదు. సమీచీన లక్షణము గల భావనకూడా దానికి తోడ్పడ వలయును సమకాలమునందే నిలిచి, సర్వకాలీన సత్యములను దర్శింప గల ద్రష్ట్వ లక్షణము కూడా ఉద్యమ ప్రాదుర్భావమున కవసరము అని అంటారు.

ఇక భావకవిత్వం గూర్చి సాహితీ వేత్తలు యిచ్చిన నిర్వచనాల్ని వివరణల్ని గనుక పరిశీలిస్తే; దాని స్వరూప స్వభావాలేమిటో తెలియవస్తాయి.

The Encycopedia America లో (1829 1951) భావకవిత్వ సంప్రదాయ కవిత్వాలకు గల భేదం యిట్లా చెప్పబడింది.

"...... Classism is thus always definite objective and complete, while Romanticis mis always touched with subjectivity and thus with a sugge-tion of incompleteness, which is due

to the fact that it seetks to convey the mystery of spirit for which no objective mode of expression is adquete, and which therefore can only be symbolized and vaguely suggested"[5]

అంటే సంప్రదాయకవిత్వం అనివార్యమైన వస్త్వాశ్రయమైనదీ, సంపూర్ణమైనదీనూ, కాగా భావకవిత్వం (**Romanticism**)సదాఆత్మాశ్రయత్వమును తడిమినదీ అసంపూర్ణమైనదై సలహా మాత్రమే అయినది. సత్యకారణమేమంటే హృదయ గతభావమును వ్యక్తీకరించుటకు భావకవితకు ఏ వస్తురూపేణ వ్యక్తికరణ చాలదు, గనుక ప్రతీకాత్మకంగా, అస్పష్టంగా మాత్రమే సూచించుట జరుగుతున్నది.

"...... Art, Romanticists declare, must spring from the untrommeled expression of the free spirit of the man of genious[6]"

"The will or caprice of the Poet," as Schelegel says" Admits nolaw above it self [7]".

దీని అర్థంయిది. ప్రజ్ఞావంతుడైన మానవుని స్వేచ్ఛాహృదయం నుంచి అనర్గళంగా పెల్లుబికి వచ్చేదే కళయని భావకవులు ప్రకటిస్తారు. షెలెగెల్ అన్నట్లూ "కవికుతూహల కౌటిల్యాలకు మించి భావకవిత ఏ శాసనాన్ని ఒప్పుకోదు." ఇదే భావాన్ని కృష్ణశాస్త్రి గారు కొద్ది తేడాతో

''నవ్వివోదురు గాక నాకేటిసిగ్గూ
నా యిచ్ఛయే గాక నాకేటివెఱపు"

అని చెప్పారు.

విశ్వనాథ సత్యనారాయణ గారు భావకవిత్వాన్ని "కవియొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము ఒక చిన్నకావ్యములో ఊదబడినచో అదిభావకవిత్వం" అని చక్కగ నిర్వచించినాడు.

శ్రీశ్రీ గారు ''హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారం గలదు. అట్టి అతని సంచారాలలో ఏ సన్ముహూర్తాననో కావ్యగేయ ఒకటి మెరుగులు తీరిన విలక్షణ ధోరణిలో వెలుగుచూస్తుంది ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్ట భావ గీతానికి నా నిర్వచనం ఇది'' అని అన్నారు.

డా. సి. నారాయణ రెడ్డి గారన్నట్లూ, ఇది వివరణ మాత్రమే కాని నిర్వచనం గాదు. ఎందుకంటే నిర్వచనానికి సంక్షిప్తత (భావ కవితగూర్చి విశ్వనాథ నిర్వచనం లాగ) సర్వపాఠకాంగీకృత మైనది. మహా అయితే 5 లైన్లు మించరాదు.

డా. సి. నారాయణరెడ్డి గారు భావ కవిత గూర్చి యిట్లా వివరించినారు. "కవిత్వమునకు వస్తు, భావ, రచనలను మూడంగములున్నవనీ, యిందులో పురాణములు, ఇతిహాసములూ వస్తు ప్రధానములైన వనీ, ప్రబంధములు అల్పవస్తుకములైనను రచననాశ్రయించి బ్రతికిన వనీ, ఈ రెంటిలోని లోటును తీర్చుటకు వెలువడిన కవిత్వమే భావకవిత్వమనీ అనగా భావకవితలో వస్తు రచనలకన్న భావానికే ప్రాధాన్యత ముంటుంది. కాబట్టి యిది భావకవిత అయ్యిందనీ'' తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు.

ఇన్ని నిర్వచనాల, వివరణల పరిశీలన తరువాత పరిశోధకులు గ్రహించే విషయాలివి:

1. ప్రకృతినైనా, స్త్రీ నైనా, మరేవస్తువు నైనా ఆత్మసౌందర్యం ఆధారంగా వర్ణిస్తాడు భావకవి.

2. అస్పష్టత, అసంపూర్ణత, విశృంఖలత్వం భావకవిత స్వభావం.

8. సమాజంతో సంబంధం అంతగా లేక పోవడం దానితీరు.

# అథ సూచిక

1,2; అధునికాంధ్ర కవిత్వము
సంప్రదాయములు- ప్రయోగములు
డా. సి. నారాయణ రెడ్డి

3 "తెలుగులో కవితా విప్లవాల స్వరూపం'' చదివిన తరువాత ఏర్పడిన వివరణ ఇది. పేజ 1&8
డా. వెల్చేరు నారాయణ రావు

4. ప్రకృతి– మానవుడు (అముద్రితం) పేజి 29
డా. అరిపిరాల విశ్వం
భావకవిత్వం– కాల్పనికోద్యమము
5. 6, 7. The Encyclopedia America 1829-1951; P. 655; 656. Newyork, chicogo, America corporation.
8 కృష్ణ పక్షం కృష్ణశాస్త్రి పేజి 5
9. లిరికల్ పోయట్రి (వ్యాసం) విశ్వనాథ సత్యనారాయణ భారతి, అక్టోబరు 1939
10 మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారి లేఖనుండి భారతి; జూన్ 1934. (ఆ అం క పే 303
11 ఆ. అం. క. పేజీలు 305; 303
(ఆధునికాంధ్ర కవిత్వము సంక్షిప్త సంకేతం)
తేది. 11-4-84.

**పి. దశరథరెడ్డి**

++++

# షరామామూలే పరిశీలన

మొదటి నుంచి మనదేశములో జరుగుతున్న విషమ పరిస్థితుల్లో ఒకటి ఏమిటిఅంటే, విదేశాలలో రయితలకు మంచి పేరు వచ్చిన తరువాత భారతదేశాలలో తిన్నగా గౌరవించడానికి ప్రయత్నిస్తారు. ఉదా, సత్యజిత్ రాయ్ తన "ది వరల్డ్ ఆఫ్ అపు" అనే చిత్రం ద్వారా లండన్ లోనూ, న్యూయార్క్‌లోనూ చాల ప్రసిద్ధి చెందాడు. అపుడు మన భారతీయులు కూడ సత్యజిత్‌రాయ్ యొక్క గొప్పతనాన్ని గౌరవించారు. పంజాబీ విశ్వవిద్యాలయంలో లెక్చరర్ ఉద్యోగానికి నోచుకోని హరగోవింద ఖోరానాకు నోబుల్ ప్రైజు వచ్చిన వెంటనే సన్మానాలు, సభలు భారత దేశంలో జరుపబడ్డాయి. ఆంధ్రప్రదేశ్ యేకాక తమిళనాడు, ఒరిస్సా, మహారాష్ట్ర మొదలగు మిగతా రాష్ట్రాలలో ప్రసిద్ధి గాంచిన డా. కొలకలూరి ఇనాక్ సాహిత్య అకాడమీ గౌరవాలు పొందినా అనంతపురం జిల్లాలో చెప్పుకోదగ్గ గౌరవం పొందలేదు.

మనదేశానకి పట్టిన మరియొక దుర్గతి ఏమిటి అంటే ఒక విదేశీయుడు వ్రాసిన పుస్తకము ఏదైనా ఉంటే దానిలో లేకున్నను, లేనిపోని బింబ విధానం, నూతన పోకడలు అని చెప్పి గౌరవిస్తారు. అదే డా. కొలకలూరి ఇనాక్ "షరామామూలే" లాంటి 'క్లాసిక్స్' వస్తే ఎలాంటి విమర్శలేకుండ ఊరకుంటారు. "షరామామూలే" అనునది డా కొలకలూరి ఇనాక్ కవితాసంకలనం. ఈ పుస్తకాన్ని చదివిన తరువాత ఇది ఆంధ్ర సాహిత్యంలోనేగాకుండ భారతీయ సాహిత్యములోనే, ఒక కొత్త దారిలో నడుస్తున్న పుస్తకం అని మనము అంగీకరింపక తప్పదు.

కవి బింబ విధానం ద్వారా నేటి దేశపరిస్థితి చాలా చక్కగా వివరించాడు. ఉదా 'తెగిన గాలిపటం' ఈనాటి జీవంలేని మానవుని స్థితికి ప్రతీక 'ఆర్షభూమి' అనునది భారతీయ జాతి గౌరవానికి ప్రతీక. ప్రస్తుతము ఆర్షభూమి ఏ స్థితిలో ఉన్నది కవి చాల చక్కగా వర్ణించినాడు

"గాదిలోనుంచి ఖాళీహస్తం లేస్తే
మనిషి నాగలితో పొలం పోగా
భుజం, నాగలి ములికి, రక్కుకొని ముక్కలు
అయ్యాయి
గోదైవ వధ చేత, పొలం పండక, తినక
ఇసుక రేణువులై నానకోట్ల ప్రజల
ఎడారి ఆర్షభూమి"

'గుప్పెడు మట్టి' అను ఇంకొక కవిత మానవుని గర్వాన్ని అణచివేయుటకు సలహా ఇస్తుందా అనిపిస్తుంది నీళ్ళలో నిప్పు పుట్టించిన మనిషి, రాళ్ళలో రత్నాలు తీసిన మనిషి అతని గర్వాన్ని సవాలు చేస్తున్నట్టు కవి చెప్పాడు.

లాబరేటరీలో విశ్వాన్ని ప్రసవించాడు
టెస్టు ట్యూబ్ బేబిగా పెరిగాడు;
ఇప్పుడు ఏమయ్యాడు
గుప్పెడు మట్టి"

ఛందోబద్ధమైన కవిత్వాన్ని గూర్చి ఠాగూర్ అన్న మాటలివి.

"our self– expression must find its freedom not only in spiritual ideas but in literary manifesttaons Bur our literature lacked movement, and was feathered by a rhetoric rigid as death - - - it is necessary for the races of man to give a perfe-

ct expression to their sentiments(my life, Alecture delivıredın ching(I984

అందుకే ఠాగూర్ దేశకవిత్వంలో ఛందోరహితమైన కవిత్వాన్ని వ్రాశాడు మొదట్లో ఆయన్ని అందరూ ఎగతాళి చేశారు. ఆయనదిశ్ర సహిస్తు తన గీతాంజలి' ని ఆంగ్లం లోనికి తర్జుమా చేశాడు. ఆయనకు 'నోబుల్ బహుమతి లభించింది, అప్పుడు ఎగతాళిచేసినవారే ఆయన్ని ప్రశంసించినారు. తెలుగుకు ఈనాడు ఛందోబద్ధమైన కవిత్వం వల్ల చాల అన్యాయం జరుగుతూవుంది. అదృష్టవశాత్తు డా. కొలకలూరి ఇనాక్ వంటి కవివర్యులు, అభ్యుదయ కవిత్వం ద్వారా అందరికి అర్థమయ్యే రీతిలో తమఅభిప్రాయాలు అందించారు.

వీరు ముఖ్యముగా రెండు 'ఇమేజస్'(ప్రతిమలు) వాడుతారు. ఒకటి భావములను ఉత్పత్తి చేయు 'ఇమేజ్' రెండవది సామాన్య ఇమేజ్ ఉదా. మహాత్ముడు అను కవితలో పేదవాణ్ణి ఉద్దేశించి కవి ఇలా చెప్పుతాడు.

"వాడు బట్ట కడితే
వెలుతురు గాలినంటి మీద కొట్లాడుకున్నాయి."

ఇక్కడ పేదవాడు కట్టుకొన్న బట్ట ఇమేజ్ గా నిలుస్తుంది. ఇది అనేక ఇతర భావములను జనింప చేస్తుంది. పేదవానికి కట్టుకొనుటకు తగిన బట్ట లేదనీ, ఒకవేళ బట్ట దొరికితే చినిగినబట్ట దొరకుననీ, ఆ చినిగిన బట్ట ధరించిన వంటిమీద గాలి; వెలుతురు, ఒకదానిమంచి ఒకటి పోటీపడుననీ, తెలుపుతూ పేదవారి దీనస్థితిని సూచిస్తాయి. ఈ రెండు పంక్తులలో సుమారు ఒక పుస్తకం వ్రాయుటకు తగిన సామగ్రి లభిస్తుంది· ఇలాంటి సన్నివేశాన్ని టి యస్ ఎలియట్ మహాశయుడు తన 'వేస్ట్‌లాండ్' లో వర్ణిస్తాడు. ఇచట మిథ్యానగరం యనునది ఒక బింబం అది ఆధునిక నగర జీవనంను ప్రతిబింబింపచేయు ఏ నగరమైనను కావచ్చును· ఆధునిక జీవనం యాంత్రిక జీవనమైనది. మరియు గమ్యములేక అడవిడిగా వెళ్ళుచున్న ప్రజల జీవితమును ప్రతిధ్వనింప చేయును ఎలాగైతే 'లండన్ బ్రిడ్జ్ క్రింద నీరు ప్రవహించుచున్నదో, అలాగే ప్రజలు చాల వేగంతో ప్రవహించుచున్నారు. దీనిద్వార్తా అనేక భావావేశములు ఒక బింబంలో కవి ఇమిడింప చేస్తున్నాడు

ఇలాగే అర్షభూమి అను కవితలో
"గోదైవ వధ చేయక
పొలము పండక తినక
ఇసుకరేణువులైన కోట్ల ప్రజల
ఎడారి అర్షభూమి"

ఇందులో ఆధునిక భారతదేశం యొక్క దీనస్థితిని చక్కగా విశదీకరించాడు.

'ఈ ఉగాది అనే కవితలో కూడ ఒక చక్కటి ఇమేజ్ ద్వారా కవి తన భావాన్ని వ్యక్తీకరిస్తాడు ఆయన ఉగాదిని రాజకీయ చదరంగంతో పోల్చాడు.

"కాలం బాలుడు ప్రకృతి కాగితం మీద
రంగు పెన్సిలుతో గీసిన వయ్యారమైన గీత"

ఇచట వయ్యారమైన ఉగాది పండుగను గూర్చి కవి చాల చక్కగా వివరిస్తాడు. ఇది ప్రతి సంవత్సరము వయ్యారంగా వచ్చేపండుగేననీ బీదవాని బీదరికంలో ఎలాంటి మార్పు లేదని ఉగాదిపండుగ మాత్రము అవిర్లు నిమ్ముతూ పొగమంచై చేదురుచి చూపుతున్నట్టు చాల చక్కగా సృష్టించాడు.

సమానాంతర పరిస్థితులు, వ్యతిరేక పరిస్థితుతులు వీ ద్వారా కవి నేటి వ్యవస్థతో ఎలాంటి మార్పు లేదని చాల చక్కగా వివరించాడు.

"కరెంటులేని ఫేన్‌గది ఉక్కలో ఉండలేని పసిపిల్లల
చక్కెర ఫ్యాక్టరీలోని సంసారి త్రాగిన చెరకు రసంలా
ఒకలైను మీద ఆగకుండా తిరిగే గ్రామఫోను రికార్డులా
మాల బరువుతో తలవంపులైన పెళ్ళికూతురిలా
అభినవ మన్మథుడి బ్రాందిగ్లాసులో స్నానం చేసిన
ఈగలా వచ్చింది ఉగాది

ఇచట ఉగాది పండుగకు, బీదప్రజల దుస్థితిని గూర్చి కవి చాలా చక్కగా వర్ణించాడు. ఇలాంటి పరిస్థితులు నాలుగైదు వివరిస్తూ ఉగాదివాడు ఏమి జరుగుతున్నది. చాల చక్కగా వర్ణించాడు.

వ్యంగ్యము (irony) అనుదానిని ఒకప్రక్రియ తీసికొని తన భావాన్ని వివరించుటలో కవివర్యులు ప్రావీణ్యతను సంపాదించారు

''ఔను మొనగాళ్ళు'అనే కవితలో 'తెలుగోళ్ళను' మొనగాళ్ళను కత్రపుచ్చుకొని తగలెద్దాం, అనే పదాల ద్వారా ఆంధ్రుల యొక్క అపరిపక్వతను సూటిగా చెప్పినాడు వాళ్ళలో ఐకమత్యం లేదనీ, మాతృభాష

తక్కువ నీకులమత భేదాలు ఎక్కువనీ వాళ్ళు తమరిని సరిదిద్దుకొనుటలో జాగ్రత్తపడవలయునని వ్యంగంగ్యాగాచెప్పాడు

'షరామామూలే' అను కవితలో కూడా ఈ విషయం గోచరమౌతుంది.

ఇక జీవిత నాటకం
ప్రాచీన భారతీయ వాఙ్మయములలో సందేశం
దేవుడు సృష్టికర్త
రక్షణ, శిక్షణ భగవంతుని విధులు
చాతుర్వర్ణ్యం వ్యవస్థా ధర్మం
ఆశ్రమ విధాన జీవితం
సత్పురుషుడికి స్వర్గం
దుష్టుడికి నరకం

ఇచట జీవిత నాటకంలో వర్ణాశ్రమ ధర్మం ఎలాపాతుకొని పోయిందో దానివల్ల ఎంత మంది నరకయాతన అనుభవించు చున్నారో స్పష్టికరించాడు.

మనదేశమా అనే కవితలో కూడ ఒకవైపు సిమెంట్ కంట్రోలు రేటు పదినుంచి ఇరవైకి పెరిగిందని కాంట్రాక్టరు బాధ దగా, సిమెంటు అంటే ఏమిటి, మట్టి ఎందుకు తాటియాకు రేటు పెరిగిందని ఒకవైపు పూరిగుడిసె సొంతదారుళు అన్నాడు అదే కవితలో "సమస్యలుంది ఒకరికా యిద్దరికా; అందరికీ ... మనకేమి మనం బాగున్నాము మన దేశమా! అని చెప్పుతూ ఈ వ్యంగ్యపద్ధతి ద్వారాదేశంలోని ఆ వ్యవస్థను స్పష్టీకరించాడు.

వ్యంగ్యంద్వారా తాను చెప్పదలచుకొన్నది అర్థమయ్యే టట్లు చెప్పటం ఒక కళ. ఇది ఏ కొద్ది మందికో అబ్బినవిద్య ఈ సంపుటం అంతయు ఎక్కువగా ఈ వ్యంగ్యవిధానం ద్వారా చెప్పుకొచ్చాడు.

సైనికుని మరణానంతరం అతని భార్య దుస్థితిని ఈ విధంగా వర్ణించాడు.
మరణించిన సైనికునిభార్య
చేనుగనిమి మీద పర్వేరాయిలా
గుడిసెలో శిలం విరిగిన తడికెలా
నగరం వెన్ను రాచపుండులో ఆకలి పురుగులా
మురికి వీధినిప్పుటొట్టు నుదురు కాల్చే చీడలా వుంది.

ఇచ్చటు అమె చీడపురుగులా హీనస్థితిలో ఉంటుండగా అటు వైపు సైనికులు కవాతు చేస్తున్నారు. చేయకేమి చేస్తారు. అంటూ వ్యగ్యంగా సంబోధిస్తూ సైనికుని తరువాత ఆయన కుటుంబాన్ని ఎవరు గమనించలేదని విశదీకరించాడు.

ఈ శతాబ్ది మొదటి భాగంలో 'ఎన్.కౌంటర్' అనే పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ 'సాస్త్రి' అనే మహోదయుడు ఇలా అన్నాడు. "ఏ రచనగాని బీద ప్రజల జీవితాన్ని గూర్చి తెలుపదో ఏకావ్యం బిదప్రజల కన్నీటిని గూర్చి వివరింపదో ఆ రచన దండుగ రచన" ఈ భావాన్ని పరిశీలించిగా ఏ రచనయైనను సామాజిక స్పృహ సంఘంనకు సంబంధించినదిగా ఉండవలయుననీ అట్లు లేనిచో అది వృధా అగుననియు వ్యక్తమగుచున్నది.

షరా మామూలే' సామాజిక స్పృహ కలిగింపచేయు రచనలలో — ఒకటి అది పల్లెటూరి బీదసాదుల జీవన విధానాలను, పట్టణంలో నివసించు బ్రతుకుతు చస్తున్న మధ్య తరగతి జీవిత వాసి జీవితాన్ని చక్కగా తెలుపుతున్నాడు.

నాయకులు, ధనవంతులు, ఎలా వర్ధిస్తున్నారో, ఎలా అభ్యుదయాన్ని వల్లిస్తున్నారో అను విషయాన్ని 'ఏదో అభ్యుదయం' అనే కవితలో చాల చక్కగా చెప్పాడు.

'ఆట'అనే కవితలో కవి అకలి, పేదరికం కొట్లాడి ఎలాగ రగిలే కొలిమి చేశాయి అను విషయం చక్కగా ప్రతిబింబింప చేశారు.

'ఏది అభ్యుదయం' అనుకవితయందు భారతదేశమందు అభ్యుదయం లేదనియు, నాయకులు, ధనవంతులు దోచుకోవటం, దోపిడీ చేయటం, చట్టాన్ని తిరస్కరించడం, దొరల మాదిరి శాసించుట చేస్తున్నారు. ఇలాంటి పరిస్థితులలో అభ్యుదయానికి ఏదైనా మార్గమున్నదా! అసలు అభ్యుదయ మనునది జరుగుతున్నదా అని వాపోతాడు. 'మనకేమి' అను కవితలో కడుపుకోసం శీలాన్ని ఖర్చుచేసుకొన్న పేద పిల్ల బాధ, 'చిరంజీవి మనువుడు'అను కవితలో అలసిన కళ్ళు అద్ది,పుండైన కాళ్ళు కడిగి, బడలిన ఒళ్ళు రుద్ది స్నానము చేస్తున్న భారత మాత 'వాడు'అనే కవితలో గొంగళ్ళో తింటూ వెంట్రుకలు ఏరని బాధ. 'సంక్రాంతిలో ద్వేషాల గెడ్డి, విభేదాల కట్టెలు బాధల పిచు, వ్యధల పేలికలు, వేచి, చలిమంట రగుల్చు దుప్పటిలేని జీవితాలను చాల చక్కగా తెలియ చేశాడు. ఈ కావ్యంలో విశేషం ఏమంటే సామాన్య మానవునికి కూడ అర్థమగు భాష, శైలీ ఉన్నవి. అదే విధంగా మేధావులకు సరిపోవు శైలి, గంభీ

రత కలవు. ఈయన బింబవిధానం, విగ్రహం వ్యంగ్యం, సామాజిక సామరస్యం అను నాలుగు పద్ధతుల ద్వారా తాను చెప్పదలచుకున్నది చక్కగా చెప్పినాడు. ఈ విధముగా తన సిద్ధాంతములను చెప్పదలచుకొన్నప్పుడు ఒక్కొక్కచోట వైయక్తిక భావనలు వచ్చి యుండవచ్చును; కవి కూడ ఒక మానవుడే కనుక గండెకాయ పోగొట్టు కొన్నాను 'అది అంతే ,నేను', మనకేమి అను కవితల్లో వైయక్తిక భావనలు కనబడుతున్నాయి. అయినను ఎక్కువ భాగం నిష్పాక్షికంగా అందరికి అర్థమగు శైలిలో కవి వివరించాడు. ఇది తెలుగు కవితా సాహిత్యంలో 'కోహినూర్ అన్నను అతిశయోక్తి లేదు.

డా. పి బయపరెడ్డి
ఆంగ్లోపన్యాసకులు
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం



# ప్రచారక విద్యాలయములు

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు వారి ప్రవేశ పరీక్షలో పాసైన విద్యార్థులు తగినంత సంఖ్యలో లభించిన, హైదరాబాదు, చిత్తూరు, విశాఖపట్టణము, విజయవాడ, తెనాలి, అవనిగడ్డ కేంద్రాలలో ప్రచారక విద్యాలయాలు జరుపబడును. జులై 1984 రెండోవారంలో అప్లికేషన్లు అన్ని వివరాలతో పంపవలెను పది రూపాయల పోస్టల్ ఆర్డరుతో స్వంతచిరునామాగల 0-70 పైసల తపాలా బిళ్లలు అతికించిన కవరు పంపి శ్రీ శిక్షా సచివ్ దక్షిణ భారత హిందీ ప్రచార సభ- టి, నగర్ మద్రాసు- 600 017 అడ్రస్సు నుంచి అప్లికేషన్ వెంటనే తెప్పించుకొనవచ్చును. అప్లికేషన్‌లో గవర్నమెంటు వారి అడ్మిషన్ పరీక్ష వివరాలు—విద్యార్థిపేరు, తండ్రిపేరు, పరీక్ష క్రమసంఖ్య, తేదీ, కేంద్రము జన్మతిథి వగైరాలు హిందీలో పాసైన పూర్తి వివరాలు వ్రాయవలెను. గవర్నమెంటు వారి అడ్మిషన్ పరీక్షలో పాసైన వివరపు ర్యాంకు గల మార్కుల పత్రము ఇంటర్వ్యూ సమయంలో తెచ్చి చూపించవల్సి యుండును.

హైదరాబాద్
29-6-84

తం. వెం. సుబ్రహ్మణ్య శాస్త్రి
కార్యవాహి సచివ్
ద. భా. హిందీ ప్రచార సభ,
హైద్రాబాద్




# కకుత్స్థ విజయము

కకుత్స్థ అను నీ ప్రబంధమును మట్ల అనంతరాజు రచించియున్నాడు. ఇది పంచమాశ్వాసములతో నొప్పుచున్న యొక చక్కని ప్రబంధము. కవియగు అనంతరాజు ఆశ్వాసాంత గద్యలో తనను గురించి "ఇది... శ్రీమత్తిరుమల తాళప్పాచార్య చరణ సరసీరుహ సేవా సమాలబ్ధ సామ్రాజ్య ధౌరేయ నిజకావ్య భరణాయమాన యెల్ల భూ పురందర వర నందన మట్లనంత భూపాల ప్రణీతంబైన కుకుత్స్థ విజయం బను మహాప్రబంధమునం బ్రథమాశ్వాసము" అని చెప్పుకొనుటచే నీతని గురువు తిరుమల తాళప్పాచార్యులనియు, వైష్ణవ మతానుయాయి అనియు స్పష్టమగుచున్నది. విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజులను, వారి సామంతులును వైష్ణవ మతానుయాయులు తిరుమల వంశమువారే వీరందరికి సామాన్యముగా మత గురువుగా వుండెడివారు ఇదే రీతిగా దక్షిణ దేశాన్ని పాలించిన మహారాష్ట్రుల కాలం లోని వైష్ణవ మతావలంబకులకును తిరుమల వంశము వారే గురుత్వమును వహించినట్లు కాననగును. ఇళాదేవీయమను నామాంతరము గల రాధికా సాంత్వన గ్రంథకర్త్రియగు ముద్దుపళని" తిరుమల తాతాచార్య వర్య కుల కలశ పారావార తారు దారుండును, మదీయ పూర్వజన్మ తపః ఫలసారుండును, సుగుణాభి రాముడుననగు" వీర రాఘవ దేశికుల వారిని గూర్చి ప్రస్తావించినది.

తిరుమల తాళప్పాచార్యుల వారిని గురించి ఆశ్వాసాంత గద్యలందే గాక పంచమాశ్వాస మందలి యీ క్రింది పద్యమందు చెప్పియున్నాడు.

క. "లీలా మురహర తిరుమల
తాలప్పాచార్య చరణ తోయజసేవా
లోల పరాసు సమీర
వ్యాలత్కరవాల చోడవంశ నృపాలా."

(కకుత్స్థ విజయము. ఆ-5, ప, 196)

మట్ల అనంతరాజు తండ్రి ఎల్లరాజు, తన తండ్రిని గురించి, ఆతని గొప్పదనాన్ని గురించి యీ క్రింది పద్యంలో తెలిపి యున్నాడు.

సీ. గాంభీర్య భవకీర్తి కలశ పాథోరాశి
వాచాలతా కీర్తి వాగ్వధూటి
భూమీ భరణకీర్తి భోగి లోక స్వామి
సాహసార్జిత కీర్తి శంకరుండు
సంగీత జనికీర్తి జలజాత భవ సూతి
దాతృత్వ కీర్తి సంతాన శాఖి
ధైర్య ధారా కీర్తి తారాచలేంద్రంబు
వదన ప్రభాకీర్తి వనజవైరి

గీ. గాంగ విహరించు నిఖిల భూకాంతమౌళి
పటహ భాంకార కారణ ప్రళయకాల
భైరవా రావ శంకా నిబద్ధ బుద్ధి
విద్విష ద్వీరుడెల్ల పృథ్వీవరుండు

(కకుత్స్థ విజయము-ప్రథమాశ్వాసము ప. 93)

మట్ల వారు ఆరవీటి వంశమునకు చెందినట్టియు చంద్రగిరి నేలినట్టియు నగు వేంకటపతి రాయలకు విధేయులై యుండిరి. మట్ల అనంతరాజు స్వామి భక్తి పరాయణుడై వేంకటపతి రాయలకు గోలకొండ సైన్యాన్ని తరిమి కొట్టడం లోను కోలారు ముట్టడి సందర్భమందును తోడ్పడినాడు. ఈ సందర్భము నందే తంజావూరు నేలిన అచ్యుతప్ప నాయకుని పుత్రు డగు రఘునాధ నాయకుడు అనంతరాజుకు సహాయ కుడుగ నిలబడినాడు. అనగా అనంతరాజుకు రఘునాధ నాయకుడు సమకాలీనుడైనాడు. రఘునాధ నాయకుని కాలము క్రీ శ. 1600-1631 అని విమర్శకుల అభి ప్రాయము. అయినను వారి వయస్సుల మధ్య కొద్ది అంతరము ఉండవచ్చును.

మట్ల అనంతరాజు పదహారో శతాబ్ది తుది పాదం లోనో, పదిహేడో శతాబ్ది ప్రథమ పాదంలోనో ఉండే వాడని కకుత్స్థ విజయ పీఠికా కర్తలు అభిప్రాయ పడిరి.[1] దీనికాధారముగా వారు శా. శ. 1527 (అనగా క్రీ శ. 1605)వ సంవత్సరపు కడప మండలము నందలి సిద్దవటం శిలా శాసనాన్ని చూపి యున్నారు

క. "సారెకు మ్రొక్కెద మేధా
వారిజగర్భులకు వ్యాస వాల్మీకులకున్
భారత రామాయణ కవి
తారస మాధుర్య ధుర్య తాత్పర్యులకున్"

(కకుత్స్థ విజయము, అ-1, ప.5)

పై పద్యములో కవి సంస్కృత భాష యందలి వ్యాస, వాల్మీకులను మాత్రమే స్తుతించటం గమ నార్హము. కాగా తెలుగు భాష యందలి కవుల పేర్లనే అసలు తల పోయకుండా వుండటము మరియొక విశేషము.

కుకవి తిరస్కృతియు గావించినాడు.

అయినను మట్ల అనంతరాజు తన కకుత్స్థ యంలో పూర్వాంధ్ర కవులను కొన్ని పద ప్రయో గాలలో అనుసరించినట్లు కాన వస్తుంది.

కకుత్స్థ విజయము నందు మట్ల అనంతరాజు సుగంధి, పద్మనాభ వృత్తము, భాస్కర విలసితము, దోధకము, రథోద్ధత మిత్యాది విశేషవృత్తములను ప్రయోగించాడు. ఇవి మనకు అరుదుగా ప్రాచీనకవుల గ్రంథాలలో కాన వస్తాయి.

సుగంధి వృత్తాన్ని యీ ప్రబంధంలో ఆశ్వా సాంత గద్యకు ముందుగా తృతీయాశ్వాసం లోనూ, మరియు చతుర్థాశ్వాసమందునూ వాడి యున్నాడు. ఈ రెండు ఆశ్వాసము లందునూ దాదాపు ఆయా ముగింపు సందర్భములందు ప్రయోగించాడు. ఇవి కేవలము రెండు మాత్రమే. ఈ సుగంధి, 15వ ఛంద మగు అతి శక్వరి యంగు జనించిన 10928వ వృత్తము దీనికే ప్రశాంతి, హంసయాన అని నామాంతరములు. ర-జ-ర-జ-ర గణములతో నుండెడి దీని యతి స్థానము తొమ్మిదవ అక్షరము ఉదా:-

సు. "వారిజాక్ష సత్కటాక్ష వర్ధమాన వైభవా
సారసార సారిసార చంద్రికాల సద్యశః
పూర పూరి తాంతరీప భూప వీర మనసా
గార భూనటత్ప్రి తాప గర్వితారి భంజనా"

(క. వి, ఆ. 8, ప. 168)

ఇకపైన చెప్పబడిన పద్మనాభ వృత్తము 22వ ఛంధమగు 'వికృతి' నుండి ఉద్భవించినట్టిది. దాని యందలి 149797వ వృత్తముగా చెప్పబడినది. దీని లక్షణము 7 తగణములు. గగము. యతి 18వ అక్ష రము. తృతీయా శ్వాస మందలి యీ పద్మనాభ వృత్తమును పరిశీలింపుడు.

1. కకుత్స్థ విజయము. ఆం సా. ప పీఠికాకర్త. డా॥ జి. నాగయ్యగారు పుట. xiii (1980) ప్రథమ ముద్రణము.

"రావన్న రాజన్య రత్నంబు నీయట్టి రాజర్షి
యున్నాడె, నాసృష్టి యందున్
దైవంబు నీసొమ్ముగాఁ జేయఁగంటే కదా పద్మ
నాభావ, తారాశ్రయంబై
నీ వంశముం బెద్దవర్ధిల్లు మామీఁది నెయ్యంబు
డెందంబు నని ల్పు మంచుం
దీవించి సత్కార సంప్రీతు నమ్మేది నీలోక
సంరక్షకున్వేగ నంపెన్"
(క. వి., ఆ, 3. ప. 31)

రథోద్ధత వృత్తమునకు పరాంతిక అనియు నామాంతరము కలదు. 11వ ఛందమగు త్రిష్టుప్పు నుండి పుట్టిన దీని లక్షణము ర-న-ర-వ గణము యతి 7వ అక్షరము.

"గౌరి తారిణీత కంజ బాంధవా
ఙ్జారి హానిదిన యామినీ భ్రమా
చార చారు సు యశః ప్రతాప సం
చార దూరిత రసా సఖీ భయా."
(క. వి. ఆ. 2., పద్యము = 159)

భాస్కర విలసితముకూడా విశేషమైనట్టిదే. 25వ ఛందమైన అభికృతినుండి జన్మించునట్టిది. భ-న-జ-య-భ-న-న-స-గ యతి-13.

ఉదాహరణమునకు చూడుడు.

"పంచవదను నలువుల్ దిశలించెన్ భాస్కరవిలసిత
మెలమిరహించెన్
గొంచెక విబుధ విభుండరు దెంచెన్ గొప్పసురలు
నృప తిలకుల గాంచెన్
మించెఁ బ్రణయ పరిరంభము పెంచెన్ మ్రొక్కులఁ
బ్రియముులు పిదప వరించెన్.
తొంచి కనిన జయకందము లెంచెన్ బోరి తెరఁగు
లిటు లెలమి వహించెన్.
(ఆ 2 ప. 153)

ఇది కందద్వయ గర్భితము. అనగా యీ క్రింది రెండు కందములు భాస్కరవిలసితమందు గర్భితమై యున్నవి. చూడుడు.

క॥ "పంచవదను నలువుల్ దిశ
లించెన్ భాస్కర విలసితమెలమిహించెన్
గొంచక విబుధ విభుండరు
దెంచెం గొప్పసురలు నృపతిలకులఁ గాంచెన్."

మరియు

క॥ "మించెఁ బ్రణయ పరిరంభము
పెంచెన్ మ్రొక్కులఁ బ్రియములు పిదప
వరించెన్
బొంచి కనిన జయకందము
లెంచెం బోరి తెరఁగులిటులెలమి వహించెన్."

విశేష వృత్తముల ప్రయోగముననే గాక ప్రసిద్ధము లగు ఉత్పలమాలాదులలో కూడ కకుత్స్థ విజయకర్త నూతన ప్రయోగముల గావింనాడు.

ఉ॥ "నిశ్చయ మొప్పఁ బ్రాంత రమణీమణి దండ
కులున్నవారు ని
శ్చలితారు లమ్మగురుఁ జాలక నూర్వరు చిన్న
వారు ప్రా
క్పశ్చిమ దక్షిణోత్తర విభాగము లన్నవృత్తై
విశుక్షికి
న్నిశ్చల భక్తులై మెలఁగ నిర్మల చిత్త
వృత్తియై."
(క.వి., చతుర్థాశ్వాసము-పద్యము 28).

ఇందలి 1,3,4 పాదములు 20వ ఛందమునుండి జనించిన ఉత్పలమాల పాదములు. అయితే రెండవ పాదము మాత్రము. స-జ-స-స-స-జ-గ గణము లతో నున్నది. ఇది కవికంఠ భూషణమనెడి వృత్త పాదము ఇది 19వ ఛందము నుండి పుట్టినది.

2. కవితా సాగరము (పద్యలక్ష్య లక్షణ గ్రంథము) శ్రీ రావూరి దొరసామిశర్మగారి పరిష్కృతము. పుట. 93, 1962 ముద్రణము.

యతి తొమ్మిదవ అక్షరము: భిన్న ఛందస్సుల్లోపుట్టిన వృత్తాలను కలిపివ్రాసే సంప్రదాయము అంగీకార్యమే.[3] అంతేగాక ప్రాస నియమమునూ లేదు. ఇదే రీతిగా

కకుత్స్థ విజయమునందలి పంచమాశ్వాసము లోని "ఔరా యక్కృతి, ,నాదులం గలయ" అను పద్యమును కానగును.

అప్పకవి మొదలగు కొంతమంది లాక్షణికులు అంగీకరింపని రేఫ, శకటరేఫల ప్రాసమైత్రిని మల్లె అనంతరాజు కాపించాడు.

చ॥" విరిగినఁ జూచి నివ్వెఱఁగు వెల్వెలఁజేయఁ
గకుత్స్థుడేటునే
మఱక యిదే మొకో కులిశమంత్రము తప్ప
గౌదంగి నాఁడనో
కొఱఁతలు వుట్టెనో శుచితకు న్మఱి యిప్పుడు
పీని యస్త్రముల్
చెఱపనె దివ్యబాణములచే నని సంశయమొంద
నవ్వలన్''
(క. వి , పంచమాశ్వాసము-పద్యములు 130)

ల—ళల ప్రాసమైత్రికి యీ క్రింది పద్యమును

ఉ॥ "ధూళిని జోళముల్దొలిచి దోరసి ఘోరశిలీ
ముఖానల
జ్వాలల జొంపముల్దలఁచి సన్నము తోరము
శామనంబును
త్రాలము జిల్గుదట్టము గదాయను రూపుల
యున్నరూపున
య్యాలము చూచుఁజూచుసుతు సంశుమతీ
సుకుమార నేత్రముల్.
(క. వి., ఆ—5, పద్యము. 158)

క॥ "లావలికించిన మొదలివ
లావలికించిన తెలుఁగు లవలవలై కా
లావలికి నిడిన దనుజులు
లావలికిఁగకుత్స్థు బొదువనలనపుడొదవెన్."
(క. వి. ఆ. 5, ప. 116)

ఇది ద్విప్రాసమునకు దాహరణము.

ఖండాఖండ ప్రాసమునకు ఉదాహరణముగా యీ పద్యము చెప్పవచ్చును.

ఉ॥ "చూచె వనీవిభూతి యెద సొచ్చిన నిద్దురకన్ను
మూయను
న్నేచె మెఱుంగు లెల్లెడల నిండఁ దళుక్కనఁ
దోఁచిమాయమై
తోఁచె సఖీసకాశరుచిఁ దొయ్యలి యుమ్మని
మూదలింపఁగా
మోచె సమీప పుంగదళి మోహన గర్భము
మెచ్చ నెచ్చరల్.
(క.వి. ఆ. పద్యము, 56)

విశేష వృత్తాలను ముద్రాలంకారముంతో వాడాడు.

వనమయూరం :-

అత్తిరిని దివ్యమురజావళుల ధింధిం
ధిత్తిమికిఁ జిత్రములు దేలనలనృత్తా
యత్తమగు మెచ్చునకు నచ్చరలతోడన్
బొత్తుగలపెన్ నృపతపోవన మయూరుల్.

అదే విధముగా :

పంచవదను నలువుల్ దిశలించెన్ భాస్కర
విలసితమెలమి వహించెన్.
మరియు "దైవంబు నీ సొమ్ముగాఁజేయఁ
గంటేకదా పద్మనాభావతారాశ్రయంబై
కనునె దురఁద్వరితపదగతి నరుగుదేరన్.
పరిభట భయద ప్రహరణకలికా.

3. కకుత్స్థ విజయ పీఠిక. ఆం. సా. అ ప్రచురణము. '1980) పుట XLIX—L.

తలచి చూచినకొలది కకుత్స్థ విజయము నూతన విషయములను వెల్లడి చేయదగును. ఒక్కమాటలో చెప్పాలంటే "మట్ల అనంతరాజు చేసిన వ్యాకరణ ప్రయోగాలపై కూడా పరిశోధన చాలా అవసరం"[4] అన్న విషయం ఎంతో సమంజసం.

అల్లోనేరేడుల గురించి యీ క్రింది పద్యమును చూడుడు:

శా॥ సల్లోకంబుల సన్నుతుల్చెలఁగఁగా సంతాన
సంతానముం
బెల్లై పూవులు చల్లనల్ల జయలక్ష్మీ కల్య
కల్యాణగా
యల్లావణ్యవతీ వితానములు సౌహార్దంబునం
బొంగఁగా
నల్లోనేరేడు నాడుచుం జనఁగ రం భాద్యప్సరో
భామినుల్.
(క.వి. చతుర్థాశ్వాసము-ప.3)

కొఱవంజిని పేర్కొనడం కకుత్స్థవిజయములోని యీ క్రింది పద్యంలో కాననగును.

ఉ॥ కుంచియదోయి మూఁపులకు గోపులకున్నెఱి
చూపజోఁటిజో
డంచు లలంకరింప గుఱుతె న కిరీటమువెటి

సంచున కజ్జగంధి జలజాత సుగంధి మణీ
మయక్రియ
గ్లాంచినఁ బుట్టఁ బుట్టెఁఱు డెక ల్నెఱపెం గొఱ
వంజి యాటలన్
(క.వి. ఆ-3, ప. 86)

మన ప్రబంధాలలో కొరవంజిని పేర్కొనడం ఇది తొలిసారి అని సమగ్రాంధ్ర సాహిత్యకర్త అభిప్రాయము.[5] ఈ కొరవంజిని గురించి కకుత్స్థ విజయ ప్రబంధానికి ముందు రచింపబడిన అయ్యల రాజు రామభద్రకవి యొక్క రామాభ్యుదయంలో పేర్కొనబడినట్లు తెలియనగును.[6]

కకుత్స్థ విజయమందలి ఇక్ష్వాకుడు, కర్పూర తిలకను పరిణయమాడు ఘట్టమందు కవి తెలుగువారి వివాహపు వేడుకలను గూర్చి వివరించాడు. అనగా మంగళ స్నానాదులను వధూవరులచే గావింప చేయుట, మధుపర్క ధారణమును చేయించుట, మంగళసూత్రధారణము, తలంబ్రాలు పోసుకొనుట యిత్యాదులను గూర్చి పేర్కొన్నాడు. ఈ క్రింది వచనము యీ వేడుకలను గురించి తెలుపగలదు.

"మునివరుండును గర్మపుణ్యాహ వాచన మధుపర్కాది కృత్యంబు లాచరించె. వసిష్ఠాను మతంబున నమ్మహీమండలా ఖండలుండు ద్వ్యద్రత్న పీఠంబున నుండి గుడజీరకంబులు ధరించె. నట్లు గృహదేవతా సన్నిధానంబున గుడజీరకంబులు ధరించియున్న కన్నియందో తెచ్చి నెచ్చెలులు తదభిముఖంబుగాఁ దెరమఱుగున నుంచిరంత.

(ఆ 8, 158)

వధూవరుల ఆలోకనమునకు ముందు తెరమఱుగున వారి నుంచుట తెలుగువారి వివాహ సంప్రదాయము. ఆ సమయమందు జీలకర్ర బెల్లమును వారి శిరస్సుపై నుంచుట విదితమేగదా! 'గుడ' అన్యదేశీయము. మంగళసూత్ర ధారణ గావించు సందర్భమున కవియెంతో చక్కని పద్యమును చెప్పియున్నాడు.

తలంబ్రాలు పోయుసందర్భమున "పుడమిభేరీ ధణంధణ స్ఫూర్తి మొరయ దేవదుందుభినాదముల్దివిఁ

4. సమగ్రాంధ్ర సాహిత్యము. తొమ్మిదవ సంపుటము. ఆరవీటి రాజులయుగం. శ్రీ ఆరుద్రగారు. పుట. 152.
5. సమగ్రాంధ్ర సాహిత్యము. సంపుటము. 9. పుట. 150. ఆరుద్రగారు.
6. కకుత్స్థ విజయ పీఠిక-పుట. XLI ఆం. సా. అ. ప్రచురణము. (1980)

జెలంగ బోరనన్నింటెదలంత్రాలు పోయునపుడు" అన్నట్లున్నదట !

తెలుగువారి ఆనాటి సాంఘిక చరిత్రకు యెక్కువగా ఉపయోగపడకపోయినను, కకుత్స్థ విజయమునందు అడపాదడపా యిటువంటి ఘట్టముల వర్ణనములే మనకు కనిపించుచు యేవో, ఒకటో రెండో విషయములను స్పృశించుచు కొంత సంతృప్తిని కల్గించుచున్నవి.

గ్రంథారంభమందు గల శార్దూల విక్రీడితమందు తన యిష్టదైవమగు అలమేల్మంగాపతుని స్తుతించినాడు. విష్వక్సేనుని "మత్కృతీకము జగద్విఖ్యాతముం" చేయవలసినదని ప్రార్థిస్తాడా, కవి.

"విశ్వశ్రేయః కావ్యమ్" అనుటనుబట్టి విశ్వమానవ కళ్యాణానికి పాటుపడినప్పుడే ఆ కావ్యము జగద్విఖ్యాతమగుట సంభవించును కావ్యేతి వృత్తంబు ప్రసిద్ధమైయుండి క్రీ. శ. 16-17 శతాబ్దులనాటికి లౌకిక భోగలాలసత్వమునకు యీ ప్రబంధ మేమాత్రము తావీయక పోవుటయే యీ కావ్యకర్త యొక్క ఆశయమును యీ పద్యప్రయోగము ప్రతిబింబింప చేయుచున్నది.

నిజానికి, ఒకవైపు క్లిష్టదశలో నున్న రాయసామ్రాజ్యాన్ని పునరుజ్జీవింప చేయడంలోనేగాక కావ్యనిబంధనకర్తగా కూడా కతుత్స్థ విజయం ద్వారా తన ఉనికిని భద్రపరచుకొని తెలుగు సాహిత్య చరిత్రలో యీ ప్రబంధకర్తయగు మట్ల అనంతరాజు చిరంజీవి అయ్యాడంటే అతిశయోక్తి కాబోదు.

తూములూరి పార్థసారధి
- ఎం. ఏ. (తెలుగు), బి. యస్. సి.
8-1-340 శివాజి నగర్
సికింద్రాబాద్ - 500003.

# "రెక్కలు"

## కావ్యసమీక్ష

'రెక్కలు' డా॥ సి నారాయణరెడ్డి గారి కొత్తగా వెలువడిన కవితా సంపుటి, 81-82 సంవత్సరాల్లో వివిధ పత్రికల్లో వెలువడిన కవితల్లో కొన్నిటిని ఏర్చికూర్చిన సమాహారం. ఈనాడు పేలవమైన వచనంలో చిన్న చిన్న పాదాలుగా విడగొట్టి రాస్తున్నారు భావయిత్రీ శక్తి కొరవడుతోంది. నారాయణరెడ్డి గారిలో కవిత్వానికి కావలసినవన్నీ పుష్కలంగా వుండటంవలన ఆ కలం కదులుతూనే వుంది. కావ్యాలను సృష్టిస్తూనే ఉంది. రెక్కలు శీర్షికతో ఈ కావ్యం ప్రథమ కవిత ప్రారంభము అవుతుంది

సృష్టికి భూమ్యాకాశాలు రెక్కలు
కాలానికి దివా రాత్రాలు రెక్కలు.

అంటూ రెక్కలను వర్ణించారు. రెక్కలు, ఆలోచన లేదా భావాలకు కూడా ప్రతీక, రెక్కల పుక్కిట్లో పుట్టే ప్రభంజనం ధాటికి ముష్కరత్వం మరిగిన చీకటి కోట ముక్కలు ముక్కలై కూలుతుందనీ, గొడారి గోతుల్లో గుడిసెల్లో గుడ్డిబుడ్డి దీపాలతో, నిట్టూర్పుల చింకి పాతలు చుట్టుకుని శవాల్లా ఈడ్చుకుపోయే బతుకుల్లో, ఒక కెరటం పొరలివా ఒకపిలుపు మెరసినా గుడిసెలు పిడికిళ్లవుతాయి. వాదలు వజ్రధారలవుతాయి. ఈ భావం "భవం"గా మారితే సమాజము ఎంతబాగుండును అనిపిస్తుంది

కాలానికి ఎదురీదే ఆలోచన
ఎగురుతుంది దిక్కుల రెక్కలతో
చీల్చే ఎల్లలను చెరిపేస్తూ
విశ్వాన్ని ఒకే అద్దంలో వీక్షిస్తూ

కాలం ఎప్పుడూ నియమబద్ధం, హద్దుల్ని అతిక్రమించదు. సమాజం దోపిడీవర్గానిది. ఈ కాలానికి ఎదురీదే ఆలోచన సమసమాజం, అది నేటి కమ్యూ

నిజం పంచిదికాదు. ఎందుకంటే సరిహద్దులు కట్టుకున్నాయి కమ్యూనిస్టు దేశాలు, కవిభావన విశ్వజనీనం. ఇరుకువాడలను కప్పుకున్న జనంలో తిరుగుబాటు భావం రేకెత్తినపుడే తిరుగుపాటల సరికొత్త క్యాసెట్లు పూస్తాయంటున్నారు. చక్కని భావచిత్రాలు ఇవి.

దిక్కుల కత్తెరలో చిక్కి తోకతెగిన నక్క
గాలిఊళ
ఇసుక పొరల ముక్కుల్లో మూల్గే ముసలికాలం
శ్వాస

మానవ జీవితానికి సముద్రానికి సాదృశ్యం చూపేడు బాడెలేర్, 'ఓసిరా' కవితలో సముద్రంలా ఎప్పుడూ ఏదో పలుకుతూ వుండమంటున్నాడు ఇంకి పోకుండా, 'కదిలే చేయి రాస్తూనే వుంటుంది రాసినా అది కదులుతూనే వుంటుందన్నాడు ఉమర్ ఖయ్యాం.

గదికీ మదికీ గవాక్షాలుంటాయి. తెరిచే కిటికీని బట్టి వస్తుంది దూళి. జ్ఞానమధూళి (తిలక్), 'కిటికీ' ఆకాశంలో దాచుకున్న అక్షరాల నక్షత్రాలను, గుప్పెడు స్వేచ్ఛా వాయువులను, పాదాల రక్త ముద్రలను యిస్తుంది. సృజన శక్తిని పెంపొందిస్తుంది. స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. హింసను చూపుతుంది.

కొత్తదనాన్ని కురిపిస్తున్నాను
కుండపోతగా జీసస్ రక్తాన్ని చేదుకుని
మహాత్ముని ఆఖరి మూలుగుల్ని
మబ్బులుగా అల్లుకుని.

జీసస్, మహాత్ములు పాతవాళ్లేగదా! కాలగర్భంలో కలిసి పోయినవాళ్ళు. వారిలో కొత్తదనం వుందా? జీసస్ మహాత్ములలో మహనీయమైన మానవత వుంది. అది ఎప్పుడూ కొత్తదే, ఎందరో పుట్టిగిట్టినా వారికి మరణంలేదు. నాదం పుట్టింది. కవితకు అనుభూతి ప్రధానం. ఆదిలోనాదంవుందని బైబిల్, వేదం కథనం నాదానికి, ఆధ్యాత్మికతకు ఏమన్నా సంబంధం వుందా? అంటే లేదనే సమాధానం. ఈనాదంతపస్సులో పుట్టే అతీంద్రియ స్పందన, ఊర్ధ్వ జ్వలనం

నాదం-వేదం
శిరస్సు తపస్సు
మారుపేర్లు జ్వలనానికి
మనిషి పురోగమనానికి
చీకటి నుంచి వెలుక్కి
మృత్యువునుంచి బతుక్కి.

దుర్వార్తలను, దుర్గంధాలను, కాటుక చీకట్లను లాఠీ పోట్లను తట్టుకోడానికి ఆయా ఇంద్రియాలను హింసించాలి. నేటి సమాజంలో ఇవి మామూలై పోయాయి. రోజూ దుర్వార్త వింటుంటాం. నగరాల్లో దుర్గంధాలు, ఇరుకుగదులు, పోలీసుల లాఠిపోట్లు వెనక్కి తిరిగిచూస్తే అలిసిపోయినట్టుగాను, తెగ తిట్టి నపుడు ఓడిపోయినట్టుగాను, తీసిన తెర వేసినపుడు తప్పుకున్నట్లుగా 'మూడు గుర్తులు'లో చెప్పారు. కాలం గతాన్ని తలచ దన్న భావాన్ని అదే రోడ్డు' లోను, గుండె కనిపించక వెతుకుతుంటే అంధుల ఊరేగింపును చెండాడిన రక్షక భటుని ఇనుపబూటు కింద వుందని టెలిగ్రాం వచ్చిందట, గుండె మనిషిలో లేదు. చచ్చిపోయిందని వ్యంగ్యం. 'గోడమీరాత' ఆధునిక సమాజంమీద, గొప్ప సెటైర్, ఆధునిక సమాజములో మానవుడు శవప్రాయమై పోయాడు. ఏ శవాన్ని ఎక్కించారు ఈ రక్తానికి? అని ప్రశ్నిస్తున్నారు చమత్కారంగా, సముద్రాన్ని ఆవిరిగాచేసి సహారాలో వర్షిస్తానని పచ్చని కలకన్నారు. భావుకునికి బురఖా చీల్చేసే నిజం కత్తిని చూపిస్తున్నారు. భూతలాన్ని స్వర్గీకరించుకుంటూ స్వర్గాన్ని వర్గాతీత సమాజంగా అనుకుంటు వెలిగిపోవాలట.

పంచేంద్రియాల్నే కాదు
ప్రపంచాన్నే రాయిలా నిలిపేవాడు ఋషి

నిజం పంచిదికాదు. ఎందుకంటే సరిహద్దులు కట్టుకున్నాయి కమ్యూనిస్టు దేశాలు, కవిభావన విశ్వజనీనం. ఇరుకువాడలను కప్పుకున్న జనంలో తిరుగుబాటు భావం రేకెత్తినపుడే తిరుగుపాటల సరికొత్త క్యాసెట్లు పూస్తాయంటున్నారు. చక్కని భావచిత్రాలు ఇవి.

దిక్కుల కత్తెరలో చిక్కి తోకతెగిన నక్క
గాలిఊళ
ఇసుక పొరల ముక్కుల్లో మూల్గే ముసలికాలం
శ్వాస

మానవ జీవితానికి సముద్రానికీ సాదృశ్యం చూపేడు బాడెలేర్, 'ఓసిరా' కవితలో సముద్రంలా ఎప్పుడూ ఏదో పలుకుతూ వుండమంటున్నాడు ఇంకి పోకుండా, 'కదిలే చేయి రాస్తూనే వుంటుంది రాసినా అది కదులుతూనే వుంటుందన్నాడు ఉమర్ ఖయ్యాం.

గదికీ మదికీ గవాక్షాలుంటాయి. తెరిచే కిటికీని బట్టి వస్తుంది ధూళి. జ్ఞానమధూళి (తిలక్), 'కిటికీ' ఆకాశంలో దాచుకున్న అక్షరాల నక్షత్రాలను, గుప్పెడు స్వేచ్ఛా వాయువులను, పాదాల రక్త ముద్రలను యిస్తుంది. సృజన శక్తిని పెంపొందిస్తుంది. స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. హింసను చూపుతుంది.

కొత్తదనాన్ని కురిపిస్తున్నాను
కుండపోతగా జీసస్ రక్తాన్ని చేదుకుని
మహాత్ముని ఆఖరి మూలుగుల్ని
మబ్బులుగా అల్లుకుని.

జీసస్, మహాత్ములు పాతవాళ్లేగదా! కాలగర్భంలో కలిసి పోయినవాళ్ళు. వారిలో కొత్తదనం వుందా? జీసస్ మహాత్ములలో మహనీయమైన మానవత వుంది. అది ఎప్పుడూ కొత్తదే, ఎందరో పుట్టిగిట్టినా వారికి మరణంలేదు. నాదం పుట్టింది. కవితకు అనుభూతి ప్రధానం. ఆదిలోనాదంవుందని బైబిల్, వేదం కథనం నాదానికి, ఆధ్యాత్మికతకు ఏమన్నా సంబంధం వుందా? అంటే లేదనే సమాధానం. ఈనాదంతపస్సులో పుట్టే అతీంద్రియ స్పందన, ఊర్ధ్వ జ్వలనం

నాదం-వేదం
శిరస్సు తపస్సు
మారుపేర్లు జ్వలనానికి
మనిషి పురోగమనానికి
చీకటి నుంచి వెలుక్కి
మృత్యువునుంచి బతుక్కి.

దుర్వార్తలను, దుర్గంధాలను, కాటుక చీకట్లను లాఠీ పోట్లను తట్టుకోడానికి ఆయా ఇంద్రియాలను హింసించాలి. నేటి సమాజంలో ఇవి మామూలై పోయాయి. రోజూ దుర్వార్త వింటుంటాం. నగరాల్లో దుర్గంధాలు, ఇరుకుగదులు, పోలీసుల లాఠీపోట్లు వెనక్కి తిరిగిచూస్తే అలిసిపోయినట్లుగాను, తెగ తిట్టినపుడు ఓడిపోయినట్టుగాను, తీసిన తెర వేసినపుడు తప్పుకున్నట్లుగా 'మూడు గుర్తులు'లో చెప్పారు. కాలం గతాన్ని తలచ దన్న భావాన్ని అదే రోడ్డు' లోను, గుండె కనిపించక వెతుకుతుంటే అంధుల ఊరేగింపును చెండాడిన రక్షక భటుని ఇనుపబూటు కింద వుందని టెలిగ్రాం వచ్చిందట, గుండె మనిషిలో లేదు. చచ్చిపోయిందని వ్యంగ్యం. 'గోడమీరాత' ఆధునిక సమాజంమీద, గొప్పసెటైర్, ఆధునిక సమాజములో మానవుడు శవప్రాయమై పోయాడు. ఏ శవాన్ని ఎక్కించారు ఈ రక్తానికి? అని ప్రశ్నిస్తున్నారు చమత్కారంగా, సముద్రాన్ని ఆవిరిగాచేసి సహారాలో వర్షిస్తానని పచ్చని కలకన్నారు. భావుకునికి బురఖా చీల్చేసే నిజం కత్తిని చూపిస్తున్నారు. భూతలాన్ని స్వర్గీకరించుకుంటూ స్వర్గాన్ని వర్గాతీత సమాజంగా అనుకుంటు వెలిగిపోవాలట.

పంచేంద్రియాల్నే కాదు
ప్రపంచాన్నే రాయిలా నిలిపేవాడు ఋషి

# వార్తావాహిని

### ప్రమాణపత్ర వితరణోత్సవం, రాయదుర్గం

తేది 13 జూన్ 1984న రాయదుర్గం తాలూకా తాళ్ళకెర గ్రామములోని ప్రాథమికోన్నత పాఠశాలలో "హిందీ పరిచయ" పరీక్షలో ఉత్తీర్ణులయిన విద్యార్థుల ప్రమాణపత్ర వితరణోత్సవం శ్రీ జె. వేంకటేశ్వర, ప్రధానోపాధ్యాయుల అధ్వర్యాన జరిగింది. హిందీ పండితులు శ్రీ ఇ. జె. నరేష్ కుమార్ "జయసుమన్"గారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, వారు జరుపుచున్న పరీక్షలను గురించి వివరించారు. శ్రీ జె. వేంకటేశ్వర ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రముల నందించారు.

శ్రీ ఎ గోపీనాథాచార్‌గారు ఉపన్యసించారు.

ముఖ్య అతిథిగా శ్రీ కె మల్లికార్జున రావుగారు పాల్గొన్నారు. శ్రీ ఇ. జె. నరేష్ కుమార్ "జయసుమన్" హిందీపండిట్ వందనసమర్పణ గావించారు.

### "హిందీ పరిచయ్ మౌఖిక పరీ ప్రమాణ పత్ర వితరణోత్సవము

స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాల, పామిడి యందు దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర, హైదరాబాద్ స్వర్ణజయంతిని పురస్కరించుకొని నిర్వహించబడిన (జనవరి'84లో) హిందీ పరిచయ్ మౌఖిక్ పరీక్షా ప్రమాణపత్ర వితరణోత్సవము ది. 24. 6. 84న జరుపబడినది.

హిందీ ప్రచారకులు శ్రీ ఎ బి ఉమాశంకర్‌గారు అతిథులకు స్వాగతము పలుకుచూ, సభయొక్క స్వర్ణజయంతి విశిష్టతను, హిందీ పరిచయ్ పరీక్షల ప్రాముఖ్యతను గూర్చి వివరించిరి.

సభకు శ్రీ కె. చిదంబరప్ప, హెడ్మాష్టర్, (జడ్.పి. హెచ్. స్కూల్ నల్లమాడ) గారు అధ్యక్షత వహించినారు. వారే ఉత్తీర్ణులైన విద్యార్థులకు హిందీ పరిచయ్ పరీక్షా ప్రమాణ పత్రములను బహూకరించిరి.

ముఖ్య అతిథులైన శ్రీ జి. యం. డి. ఖాశిం (హిందీ ప్రచారకులు, జి. ప. హైస్కూల్, కల్లూరు) గారు అభినందించిరి.

హిందీ ప్రచారకులు వందన సమర్పణ చేసిన తర్వాత జాతీయ గీతంతో సభముగిసెను.

### "కన్నీటికథ" పద్యకావ్యావిష్కరణం అంకిత మహోత్సవము కరీంనగరము

1984 జూన్ 17వ తేదీన కరీంనగరం కళాభారతిలో శ్రీ తోపుచర్ల రంగారావుగారు రచించిన "కన్నీటికథ" పద్యకావ్య అంకితమహోత్సవం కడు వైభవముగ జరిగినది-సారస్వత జ్యోతిమిత్రమండలి పక్షమున ప్రచురింపబడిన కావ్యమును అధికారభాషా సంఘం చైర్మన్ డా. సి. నారాయణ రెడ్డిగారు ఆవిష్కరిస్తూ రచయిత యోగ్యతను ప్రశంసించిరి. శాసనమండలి సభ్యులు ప్రముఖ రాజకీయవేత్త సాహిత్యాభిమాని శ్రీ వెలిశాల జగపతిరావుకు కృతిసమ

ర్పణగావిస్తూ రచయిత కృతికర్తయగు శ్రీ వి. జగపతిరావు, మరియు ఆవిష్కర్తయగు డా. సి. నారాయణరెడ్డి గారలను పట్టుశాలువలతో, పూలమాలలతో ఫలపుష్పాదులతో సన్మానించారు. తదనంతరం కృతికర్త మరియు ఆవిష్కర్తలిరువురు కూడా గ్రంథకర్తయగు శ్రీ తోపుచర్ల రంగారావును శాలువలతో పూలమాలలతో సన్మానించారు

సమావేశకర్తగ యున్న సారస్వత జ్యోతిమిత మండలి అధ్యక్షులు శ్రీ బోయినపల్లి వేంకటరామారావుగారు కూడా కృతికర్తయగు శ్రీ తోపుచర్ల రంగారావును సన్మానించారు.

3,4 వేలమంది ప్రేక్షకులుగల ఈ సాహిత్య సభకు శాసనమండలి సభ్యులు శ్రీ గీట్ల జనార్ధన్ రెడ్డిగారు అధ్యక్షత వహించిరి. జిల్లాపరిషత్ చైర్మన్ శ్రీ కేతిరి శాయిరెడ్డి, రాష్ట్రీఆప్కారి శాఖామాత్యులు శ్రీ టి. జీవన్‌రెడ్డి, అప్పుడప్పుడే ఆదే వేదికపై వైభవముగ షష్టిపూర్తి ఉత్సవము జరుపుకున్న శాసనసభసభ్యులు శ్రీ కొత్త రాజిరెడ్డి శాసనమండలి సభ్యులు శ్రీ యం. కృష్ణారెడ్డి గారలేకాకుండ శ్రీవత్సాచారి మున్నగు విద్యావేత్తలు అధ్యాపకులు, పలువురు ప్రముఖ రచయితలు సమత అధ్యక్షులు ఈ సభలో ప్రత్యేకాహ్వానితులుగ పాల్గొన్నారు.

ఇదే వేదికపై షష్టిపూర్తి జరుపుకున్న శ్రీ కొత్త రాజిరెడ్డిగారిని సారస్వత జ్యోతిమిత్ర మండలి అధ్యక్షులు శ్రీ బి. వెంకట రామారావు ఖద్దరు శాలువాలతో పూలమాలతో సత్కారాలుజరిపి అభినందించిరి.

కృతికర్త శ్రీ వి. జగపతిరావుగారు తనకు కన్నీటి కథ అంకితమిచ్చిన రచయిత శ్రీ తోపుచర్ల రంగారావును ప్రోత్సహిస్తూ సత్కారపూర్వకముగ గ్రంథ ముద్రణకగు వ్యయమును భరించుట ఆయన దాతృత్వమునకు నిదర్శనము.

## ప్రమాణపత్ర వితరణోత్సవము
## రాజమండ్రి

24-6-84 హిందీ ప్రేమీమండలి ఆధ్వర్యమున విక్రమ హాలులో ప్రమాణపత్ర వితరణోత్సవ సందర్భంగా పేపర్ మిల్లులో స్టోర్స్ ఆఫీసర్‌గా పనిచేసి విశ్రాంతి తీసుకుంటూవున్న శ్రీ ఎ. ఆర్. జైన్‌కు అభినందన కార్యక్రమము శ్రీ తాడూరి కృష్ణారావు (హిందీ ప్రేమీ మండలి ఉపాధ్యక్షులు) అధ్యక్షతన ఘనంగా జరిగినది. శ్రీ ఎ ఆర్, జైన్‌కు గీతా ప్రబోధము"యొక్క మెమెంటో శ్రీ తాడూరి కృష్ణారావు ఫలపుష్పాదులతో సన్మానంచేసి సమర్పించారు.

సభాప్రారంభం శ్రీ ఆర్. కె. పురోహిత్ చేస్తూ "శ్రీ జైన్‌ను హిందీ సాహిత్యంలో బాగా అనుభవం సంపాదించి హిందీ ప్రేమీమండలికి సేవచేసినందుకు ధన్యవాదాలుచెప్తూ, రాజమహేంద్రిలో హిందీసేవకు జైన్ అంకితం కావాలని కోరారు.

సర్వశ్రీ ముళ్లపూడి సూర్యనారాయణమూర్తి బి. వి. రమణ చేబోలు శేషగిరిరావు, మెరపల సన్యాసిరావు, పురాణపండ పార్థసారధి మాట్లాడినారు. శ్రీ ఆర్. కె. పురోహిత్ (ఎ పి పి. మిల్సు) విద్యార్థులకు ప్రమాణ పత్రాలు వితరణ చేసారు.

శ్రీ ఎ. ఆర్. జైను సన్మానమునకు కృతజ్ఞతలు తెలిపినారు. హిందీప్రేమీ మండలి, ముందుకుపోతూవున్నందుకు కార్యవర్గ సభ్యులకు, అధ్యాపక వర్గానికి ధన్యవాదాలు సమర్పించారు.

కుమారి బి. శారద (ప్రిన్సిపాల్) వందన సమర్పణ చేసారు.

(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుచున్న హిందీపండితులు)



పేరు .- వెలుటూరి వెంకటరమణమ్మ.

కేంద్రం :- విజయనగరం

అర్హతలు :- రా. భాషా విశారద, బి. ఏ.

వృత్తి :- హిందీ పండిట్

అభిరుచి :- హిందీ ప్రచారం, హిందీ పరిచయ. పరీక్ష ద్వారా 300 మంది విద్యార్థులకు హిందీ నేర్పుటకు ప్రత్యేక కృషి.

చిరునామా :- శ్రీ [illegible]. వి. రమణమ్మ
హిందీ పండిట్
27-3-18 వెలుటూరివారి స్ట్రీట్
విజయనగరం, 531 202
విజయనగరంజిల్లా (ఆం. ప్ర)



పేరు :- జంగా సామ్రాజ్యలక్ష్మి

అర్హతలు :- బి. ఎ. ప్రవీణ-ప్రచారక్

కార్యక్షేత్రము :- వెంకటగిరిటౌన్

వృత్తి :- హిందీ పండిట్

అభిరుచి :- సాహిత్య సమావేశములు, భజన కార్యక్రమములలో పాల్గొనుట, 300 మంది విద్యార్థులకు హిందీ పరిచయపరీక్ష ద్వారా హిందీ నేర్పుట.



పేరు :- పీసపాటి వెంకటాచార్యులు

జన్మస్థానం :- బొబ్బిలి

కార్యక్షేత్రం :- సమితి ఎలిమెంటరీస్కూలు, కొత్తవలస

యోగ్యత :- తెలుగు :- సాహిత్య ఆచార్య
హిందీ :- సాహిత్య విశారద. యస్. యస్. యల్. సి.

అభిరుచి :- హిందీ, తెలుగు, సంస్కృత భాషల ప్రచారం.
హిందీ పరిచయ పరీక్షకై ప్రత్యేకకృషి.

చిరునామా :- ప్రిన్సిపల్, శ్రీరామాహిందీ విద్యాలయం, కొత్తవలస,
531 181 విజయనగరం జిల్లా



పేరు :- ఎ. ఛాయమ్మ

కేంద్రం :- అనంతపురం

వృత్తి :- హిందీ పండిట్

యోగ్యతలు :- రా. భా. ప్రవీణ, హిందీ పండిట్ ట్రైనింగ్, ఇంటర్

అభిరుచి :- హిందీ ప్రచారం, 300మంది హిందీపరిచయ విద్యార్థులకై కృషి.

చిరునామా :- ఎ. ఛాయమ్మ, హిందీపండిట్ గాంధీ ఆదర్శ హిందీ
విద్యాలయం, రాఘవాచారిరోడ్
అనంతపురం-515 001 (A. P)



పేరు :- శ్రీమతి యం. వేదవల్లి

వృత్తి : ప్రిన్సిపాల్, ఆదర్శహిందీమహా విద్యాలయం, విశాఖపట్నం. 1

అభిరుచి :- హిందీ ప్రచారం, హిందీ పరిచయ పరీక్షయందు ప్రత్యేకకృషి

మెంబరు:- శిక్షాపరిషత్ ద.భా. హిందీ ప్రచారసభ, మద్రాసు-17

,, ద. భా. హిం. ప్రచారసభ ఆంధ్ర, హైదరాబాద్

చిరునామా:- కార్యదర్శి హిందీ ప్రేమీ మండలి, గన్నేరువీధి,
విశాఖపట్నం 530 001



పేరు : పీలుఖాన్నా మోహనరావు

జన్మతిథి :- 12-1-1941

జన్మస్థానము :- రాచూరు. ప. గో. జిల్లా

యోగ్యత :- రా. భా. ప్రవీణ, హిందీశిక్షణ్ ప్రవీణ, ఇంటర్

వృత్తి :- సీనియర్ హిందీ పండిట్

కార్యక్షేత్రము :- సింగరేణి కాలరీస్ హైస్కూలు, రామకృష్ణాపురం.

అభిరుచి :- హిందీప్రచారం, హిందీపరిచయ పరీక్షకై ప్రత్యేకకృషి



పేరు :- యం. హబీబ్‌పాషా
వృత్తి :- హిందీపండిట్
జన్మస్థానం :- మిద్తూరు, కర్నూలు జిల్లా
జన్మతిథి : 1-7-1951
కేంద్రం : కోవెలకుంట్ల,
యోగ్యత :- హిందీవిద్వాన్' పండిట్స్ ట్రైనింగ్ యస్.యస్.సి.
అభిరుచి :- హిందీప్రచారము, మాతృభాషతోపాటు తెలుగు భాషయందు పరిచయము కలిగియుండట, పరిచయపరీక్ష యందు 300 మూడువందల నూతనవిద్యార్థులకు హిందీపరిచయము గావించుట
చిరునామా :- యం. హబీబ్‌పాషా, హిం. పం. ప్రభుత్వ జూనియర్ కళాశాల, కొవెలకుంట్ల, కర్నూలుజిల్లా (ఆం. ప్ర)



పేరు :- వై. స్వామి.
పుట్టినతేదీ :- 1-7-45
వృత్తి : హిందీ పండిట్
కార్యక్షేత్రము :- సమితిఅప్పర్ ప్రయిమరీస్కూలు, కమలపురి.
యోగ్యత :- రా. భా. ప్రవీణ, హెచ్.యస్.ఉయం. పి., యస్.యల్. సి సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్
అభిరుచి :- హిందీప్రచారం, పరిచయ పరీక్షకై 300 మంది విద్యార్థులను తయారుచేయుటయందు విశేషకృషి.
చిరునామా :- వై. స్వామి. హిం. పం. ఆంజనేయస్వామి వీధి కోవెలకుంట్ల-518 134 కర్నూలుజిల్లా (ఆం. ప్ర)



పేరు : డి సి. లలితాదేవి.
వృత్తి :- హిందీ పండిట్
కార్యక్షేత్రం :- జడ్, పి. బి. హెచ్. స్కూలు. అమలాపురం.
అర్హతలు :- ప్రవీణ, ప్రచారక్, ఇంటర్,
అభిరుచి :- హిందీప్రచారం, మరియు స్వర్ణోత్సవ హిందీపరిచయ పరీక్ష యందు ప్రత్యేకకృషి.
చిరునామా :- పోష్టల్ కాలనీ, అమలాపురం 533201 తూ. గో. జిల్లా

# స్వర్ణజయంతి పరిచయపరీక్ష

నాల్గవ పర్యాయము స్వర్ణజయంతి పరిచయ పరీక్ష జరుగుతేది 22-7-84.

పరీక్షా రుసుము శ్రీ కార్యదర్శి, స్వర్ణోత్సవ సమితి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర అడ్రసుతో డి. డి. పంపవలెను. తేది 22-7-84న జరుగనున్న హిందీ పరిచయ పరీక్షకు సంబంధించిన పరీక్షా సామగ్రి ఆయా ప్రచారకులపేర **17-7-84** తేదికి అందునట్లుగ వలయు ఏర్పాట్లు చేయబడుచున్నవి.

హైద్రాబాద్
29-6-84

గోదా తిరుమలయ్య
కార్య వాహీసచివు,
స్వర్ణోత్సవ సమితి

పరీక్షా విభాగపు సూచన:

# ప్రమాణ-పత్రములు

**1984** ఫిబవరి పరీక్షల ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాషల ప్రమాణ పత్రములు తేది **10**-7-**84** నాటికి అన్ని కేంద్రములకు పంపబడును. ప్రచారకులు విద్యార్థులు గమనించ ప్రార్థన.

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.